

కుమారి రెంటాల సూర్యకుమారి

సరి హైస్కూలులో V ఫారం విద్యార్థిని. 1956 సం॥ గాన
ళా ప్రావీణ్యమునకుగాను శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మ
రి సువర్ణపతకమును బడసిన బాలిక.



కుమారి వి. బాలనాగమ్మ

కేసరి హైస్కూలులో IV ఫారం విద్యార్థిని.
శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారి బంగారు
పతకమును గానకళా ప్రావీణ్యానికి బడసిన రెండవ బాలిక.



# ప్రతి కుటుంబము రోజుకు

# ఒక అణా అదనంగా

# నిల్వచేయాలి....

ప్రతి భారతీయ కుటుంబము రోజుకు అత్యదనము ఒక అణా నిల్వ చేయడానికి నిశ్చయించుకుంటే మాసానికి ఈ చిన్న నిల్వల మొత్తము 13.5 కోట్లు రూపాయలు అగును. సాలుకు 162 కోట్లు రూపాయలు అవుతుంది. లక్షలాది ప్రజల చిన్న నిల్వల మొత్తములు దేశంలో దుర్భిక్షానికి మహదాశయములతో కూడిన అభివృద్ధి ప్రణాళికలకు కూడ ఉపకరిస్తుంది. నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లు, నేషనల్ ప్లాన్ సర్టిఫికేట్లు రూ. 5 ల చిన్న మొత్తమునకు కూడా కొనవచ్చునని జ్ఞాపక ముంచుకోండి.

భారతీయ ప్రభుత్వపు

## స్వల్ప ఆదాయాల విధానంలో పెట్టుబడి పెట్టండి

12-సం॥ల
నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లు

10-సం॥ల
ట్రెజరీ సేవింగ్స్ డిపాజిట్ సర్టిఫికేట్లు

10-సం॥ల
నేషనల్ ప్లాన్ సర్టిఫికేట్లు

15-సం॥ల
అన్యుయిటీ సర్టిఫికేట్లు
పోస్టు ఆఫీసు సేవింగ్స్ బ్యాంక్ డిపాజిట్లు.

ఇతర వివరములకు, ఈ దావరికాలను గురించిన నిబంధనలకు—నేషనల్ సేవింగ్స్ కమిషనర్, సిమ్లా, లేక మీ రాష్ట్రంలోని రీజనల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసర్‌కు వ్రాయండి.

DA 55/164 T




### చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక చాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౭] మార్చి 1956 [సంచిక 3

# వి ష య సూ చి క



ముఖచిత్రం : డాక్టరు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి







ఇటీవల బందరులో శ్రీమతి టి. వి. రాఘవమ్మ పాఠ్యగృహ ఆంధ్ర గవర్నర్ సతీమణి
శ్రీమతి కుసుం త్రివేది ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణి!



## జోహారులు

ఆంధ్ర, తెలంగాణాల విలీనంతో ఏర్పడనున్న విశాల తెలుగుభాషా ప్రాంత్య నిర్మాణం జరుగనున్న సందర్భమున యింతవరకు ఆంధ్రోద్యమాన్ని నిర్విరామంగా, దీక్షాకంకణులై నిర్వహించి, అఖండ త్యాగాలుచేసిన నాయకులను, ప్రజలను అభినందించవలసియున్నది. ఆంధ్రప్రజానీకపు పురోభివృద్ధి నుద్దేశించి ఆంధ్రరాష్ట్రసిద్ధికి, విశాలాంధ్ర నిర్మాణమునకు పరితపించుచు కొందరు, తుదకు ప్రాణాలను సయితం త్యాగంచేసిన శ్రీ పొట్టి శ్రీరాములుగార్లు కృతజ్ఞతా పాత్రులు. ఆంధ్రప్రజానీకం ఆంధ్రోద్యమచరిత్రను, తమ శ్రేయోపురోభివృద్ధులకు పాటుపడిన త్యాగమూర్తులను ఎన్నడు మరువజాలదు.

ఏర్పడనున్న తెలుగుభాషా ప్రాంతము పేరేదైనా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతీయులు విభేదాలను విస్మరించి పరస్పర సహకార, సానుభూతులతో ఉమ్మడిగా తమ శ్రేయో పురోభివృద్ధులను తీర్చిదిద్దుకొనవలసియున్నది.

ఇంతవరకు పరస్పరమున్న భయసందేహాలకు అవకాశం లేకుండా అభ్యుదయ అభివృద్ధులు యథేచ్ఛగా రాష్ట్ర, దేశ శ్రేయస్సుల నుద్దేశించి పురోగమించవలసి యున్నది.

ఏర్పడనున్న విశాలాంధ్ర నిర్మాణమునకు కేంద్రప్రభుత్వపు ఆసక్తి చాలవరకు కారణము. అంటే జాతీయ శ్రేయస్సుకు, శాంతి భద్రతలకు విశాలాంధ్ర ఉపకరించ గలదనే నమ్మకంతోను, తెలుగువారి చేతులలో జాతీయ అవకాశాలు పదిలంగా నుండగలవనే అపేక్షతో విశాలాంధ్ర నిర్మాణము ప్రోత్సహించబడింది.

తెలంగాణావారు తమ విలీనంతో ఆంధ్రప్రాంతమువారు తమ అభివృద్ధి అభ్యుదయాలపట్ల ఆసక్తిచూపరేమో, దాని మూలంగా తమ వెనుకబడియున్న ప్రాంతము అన్ని విధాల నష్టపడుతుందేమోనని భయపడుతున్నారు. ఈ భయమును తీర్చవలసిన బాధ్యత ఆంధ్ర ప్రాంతీయులపై నున్నది. వేరువేరుగా నున్నంతకాల మెట్లున్నను, తెలుగుభాషా ప్రాంతములు మొత్తంగా ఒకటైనప్పుడు అభివృద్ధి చెందవలసియున్న ప్రాంతములపట్ల అభివృద్ధిచెందిన ప్రాంతములు ఉదారంగా, సానుభూతితో వ్యవహరించవలసియున్నది. ఉభయులుకలిసి ఏకోన్ముఖంగా అభ్యుదయ అభివృద్ధులవైపు పురోగమించిననాడు రాష్ట్ర, దేశసౌభాగ్యాలకు లోటుండదు.

ఒక రాష్ట్రంయొక్క అభివృద్ధి ఏ ఒక్క విషయంమీద నాధారపడియుండదు. తరతరాలకు చిరస్మరణీయంగా జేయునవి కళాసాహిత్యాలు. కళలు, సాహిత్యము అభివృద్ధిగాంచడం ఆ జాతియొక్క ఔన్నత్యాన్ని తెలియజేస్తుంటుంది. ప్రజలలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ అభ్యున్నతికి కళోపాసన, సాహిత్యముపట్ల ఆసక్తి విశేషంగా నుపకరించగలదు.

ఈనాడు ఆంధ్రుల ఔన్నత్యాన్ని గురించి కీర్తించడానికి ఆంధ్ర సాహిత్యము, దేశంలోని శిల్పసంపద, లలితకళలులాంటి నృత్యగానముల విశిష్టత కారణము. ఆంధ్రుల భవిష్యత్పురోభివృద్ధితో నయితము కళాసాహిత్యాల అభివృద్ధిపట్ల ప్రభుత్వము ఆసక్తి చూపవలసి యున్నది.

వీటన్నిటితోపాటు విద్యార్థి దశనుండియే ప్రజలలో నైతికస్థాయి పెంపుదలకు, విశాలహృదయంతో, ఉదారభావములు అలవరచుకొనుట కుపకరించే విద్యావిధానము రూపొందించుకోవలసి యున్నది.

ఆంధ్ర తెలంగాణాల విలీనంతో యావదాంధ్రదేశం అభివృద్ధిగాంచడానికి అవకాశాలు విస్తృతమయిన మాట వాస్తవమే కాని దాని వెంబడే ఆంధ్రప్రాంతీయులపై ప్రత్యేకమైన బాధ్యతలు పడినవనునది మరువరాదు.

---

## రజతోత్సవము

శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్ వారు గత నెల 26 వ తేదిన రజతోత్సవమును జరుపుకున్నారు.

ఈ సంస్థయొక్క చరిత్రకు, మా మాతృ సంస్థ కేసరి కుటీరం లిమిటెడు చరిత్రకు పోలికలు బహు సన్నిహితములు.

సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్, మా మాతృసంస్థ కేసరీ కుటీరం లిమిటెడు, రెండును కొద్ది పెట్టుబడితో ప్రారంభమయి వ్యవస్థాపకుల నిర్వహణాకౌశలంతో మహోన్నతమయిన సంస్థలుగా రూపొందినవి.

శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్ వ్యవస్థాపకులు శ్రీ శ్రీరాం భీమశంకరరావు; సీతాపతిరావుగారలు తమ సంస్థ అభివృద్ధితో బాటు ఉదార హృదయంతో దానధర్మములు చేస్తున్నట్టివారు. డాక్టరు॥ కేసరిగారు కేసరికుటీరం లిమిటెడు అభివృద్ధితో బాటు ప్రజాహితమును నిర్విరామంగా ప్రోత్సహించారు.

డాక్టరు కేసరిగారు తమ అభివృద్ధికి మాతృదేవిపట్ల కలకాలము కృతజ్ఞతను ప్రకటించారు. శ్రీ శ్రీరాం భీమశంకరరావుగారు, సీతాపతిరావుగారలు తమ శ్రేయోపురోభివృద్ధులకు వారి తల్లి శ్రీమతి సీతారత్నమ్మగారిపట్ల శ్రద్ధాభక్తులను ప్రకటిస్తున్నారు.

శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్ దినదిన ప్రవర్ధమానమయి యజమానులకు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో బాటు, వారి విశాల హృదయాలు, ఔదార్యము ప్రజాహితాన్ని మరింతగా ప్రోత్సహించాలని భగవంతుని ప్రార్థించుచున్నాము.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

అటులనే అచల జీవ చైతన్య దృష్టినుండి బాహ్యమున, ప్రకృతి విషయములయందుండు ఆందోళనములు గమనించిన, జీవచైతన్యమే చలించుచున్నట్లు తోచుచున్నది. కాని నిజస్వభావమున అట్టి చైతన్యము కదలుటలేదు.

"అది దూరముగనున్నది — మరియు అది దగ్గరగనున్నది." సర్వవ్యాపిని ఇట్టి వర్ణనముతోనే తెలుప సాధ్యము. హిందూదేశము ఇచ్చట ఢిల్లీపట్టణమున మాత్రము కాదు—దూరపు కన్యాకుమారి వరకు వ్యాపించియున్నది. హిందూదేశము అను రాజ్యము సర్వవ్యాపకత్వము కలిగియున్నది. అనగా, ఈ దేశపు హద్దులవరకు వ్యాపించియున్నది. అటులనే, పరిశుద్ధ ప్రజ్ఞానము — పరమాత్మ, సర్వవ్యాపి గనుక, దగ్గరమున్నది దూరమునకూడ యున్నది.

హృదయావేదన, జ్ఞానసంపత్తుగలవారికి, ప్రకృతి పురుషుల తారతమ్య విచక్షణ చక్కగ చేయగలవారికి, తగినంత దివ్యజ్ఞాన ఆతురత, పావన శక్తి సంపత్తి కలిగి, నిరంతర ధ్యానమువలన విచారించగలవారికి, ఆత్మ సన్నిహితముగను, వ్యక్త స్వరూపమున అంతర గుహయందు నెలకొని యుండును. మన ఆత్మకన్న సమీపమున యుండునది మరి యేదియును లేదు. ఇతరులకు వారు తెలుసుకొనగల విషయముల కన్న చాలదూరముగ నుండును.

ఈ ఆత్మ మన హృదయ గుహయందుండునని తెలుసుకొనుటతో పరిపూర్ణము కాదు. అది సర్వత్రయుండుటను అనుభవించవలెను. శుద్ధ ప్రజ్ఞానము పరిసమానముగను, సర్వవ్యాపి. కనుక ఇచ్చట తెలుసుకొను ఆత్మయే అచ్చట, (సర్వత్ర) ప్రకటితమగుచున్నాడు.

ఈ భావము మరల బాగుగ తేటపడునట్లు "అది వీటి అన్నిటిలోను యున్నది. అది వీటి అన్నిటి బాహ్యమున యున్నది" అను వాక్యములు ప్రకటించుచున్నవి. ఆత్మసాధకుని స్థూల సూక్ష్మ శరీరముల హృదయ గుహయందు మూలాధారముగ నుండుటేగాక, ఆ ఆత్మయే ఈ సర్వ బ్రహ్మాండమునంతయును తెలుసుకొనగల సూక్ష్మాధారముగానున్నది. కనుక ఆత్మ అంతరమున మాత్రమున్నది అని, అంతర విమర్శతో తృప్తిపొందు జీవితము సత్య సిద్ధాంతమునకు విరుద్ధము. అట్టి భావమును హిందూమత శ్రుతులు ఖండించుచున్నది. కనుక శ్రుతులను చక్కగ తెలిసినవారును, హిందూమతము అంతర దృష్టిమాత్రము కలది అని నిందించ సాహసించరు.

ఈ ఈశావాస్యఉపనిషదు యందు పూర్తిగా చక్కని హిందువులను అంతరదృష్టి మాత్రముతో తృప్తిపడక, బాహ్య ప్రపంచ జీవితవిధానమును గమనించుచు, అందు తనకును, తన వర్ణమునకుగల సంబంధము గమనించి, వివిధ జాతులతో సంప్రాప్తమగు వ్యవహారములు తనకు ఎట్లు సంపర్క మగుచున్నదో గమనించవలెనని హెచ్చరించుచున్నది. ఇట్టి భావమే వేదాంతసారముగాక యుండిన యెడల వ్యాస భగవానులు శ్రీరామచంద్రుని, పార్థసారథిని, చక్కని హిందూజాతికి ఆదర్శప్రాయులుగా తెలిపియుండజాలదు. తమ వ్యక్తగత, సంసారిక, వర్ణగత జాతీయ అంతరజాతీయ సమస్యలను వుద్రేక వ్యవసాయముతో నటించియుండిరి. వారు తమ జీవిత ఆవరణములనుండి పరుగిడలేదు. వారు జీవితమును ఆశించను లేదు. కాని, జీవితదశ వారికి సంప్రాప్తమైనపుడు, తమ ధర్మమును అనుసరించుటకు జంకక చక్కగ, విచక్షణతో, సంపూర్తిగా వ్యవహరించిరి. మతి, అశాంతి,

అల్లకల్లోలము ఆలజడినుంచి, చక్కని సమత్వ, శాశ్వత, జయమను ఆనందమును సాధించిరి.

ఈ ఉపనిషదునందు, మానవుని, (అవిద్య అను) ద్వంద్వముల, ఆవరణలో చక్కగ నటించి ఉన్నత జయమును (విద్యను) పొందగల విధానమును అమర్చుకొని, ఆత్మ ప్రాప్తి (విద్య) పొంది, తన జీవితమును సఫలము చేసుకొని, ప్రపంచమున తన జీవిత సేవచే (ఆ విద్య) వ్యవహారములయందు నటించుచుండవలెనని బోధించుచున్నది. ముందు మంత్రముల విచారమున ఈ విషయము విపులముగా రాగలదు.

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవాను పశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ౬॥

అన్ని జీవిదశలు ఆత్మయందున్నవని అన్ని జీవములయందును, అన్నిరూపములయందును ఆత్మయున్నదని సర్వకాలములయందును గమనించగలిగిన మానవుడు అటుపిమ్మట దేనివలనను భయపడడు.

ముందు శ్లోకములలో హెచ్చరించినట్లు, ఆత్మ రొకడుయుండి, అతనిని తెలుసుకొనుట ఇంతటి కష్టకార్యమయిన, స్వభావముగనే తెలుసుకొనుట కడు కష్టముగా నుండిన, అతని సంపర్కము పొందుటకు గాని, అతనిని తెలుసుకొనుటకుగాని, ఒక వ్యక్తి శ్రమ పడవలసిన అగత్యము ఏమియున్నది? మన చుట్టుప్రక్కలంతయు నెలకొనియుండు, నానావిధ ద్వంద్వ స్వరూపములలో, సమత్వముగా, సర్వవ్యాపి అయిన సత్యవస్తువును, తెలుసుకొనినంత మాత్రమున ఒక వ్యక్తికి గలుగు లాభమేమి? ఇతర ఉపనిషదుల కన్న, విశదముగ ఈ శ్లోకమున, ఆత్మ సాక్షాత్కారము పొందిన ఋషి పొందగల పరిపూర్ణ శాంతము వర్ణింపబడుచున్నది. కనుక ఈ శ్లోకమును, ఉపన్యాసములయందును, గ్రంధ రచనలయందు తరచుగా వాడబడుచున్నది.

ఈ శ్లోకమును, సాధకులందరు, సదా స్మరణ చేయుచు, దీనియందలి భావములు, ప్రాముఖ్యత, మనసున యుంచుకొని యుండుట చాల అగత్యముగా నున్నది. సంస్కృత భాష చాల పరిచయములేనివారు కూడ, ఈ శ్లోకమును కంఠస్థము చేసుకుని అందలి శబ్దార్థములను గమనించుచు, వాటిద్వైనందిన ఆంతర విషములకు మనో ఆందోళనల్లకు, బుద్ధి చంచలతకు దివ్య ఔషధముగ ఉపయోగించుట మంచిదని తెలుపుచున్నాను.

ప్రపంచమునందు ద్వంద్వ స్వభావములతో కూడిన గుణములను అందుగల అసంఖ్యాకుల జీవరాసులను, వదలిపెట్టి, ఒకవ్యక్తియందే ఆత్మ పరిపూర్ణత, దివ్య తేజ స్వభావ ప్రకటన, కనుగొనుట పూర్ణ ఆత్మ సాక్షాత్కారము కాజాలదు. ఒక వ్యక్తి తన ఆత్మ స్వరూపము కనుగొనుట యనగా, ఆత్మయొక్క అద్వితీయ ఏకత్వమును అనుగుణముగా కనుగొనుట యగుచున్నది. ఒక అలయొక్క గుణమును కనుగొనుట యనగా, అలయొక్క స్వభావమేగాక, సముద్రముయొక్క గుణమునుకూడ కనుగొనుటయగుచున్నది. జీవితము ఆద్యంత రహిత నిరంతరవ్యవహారము. అట్టి జీవకళను కనుగొనుటలో, సర్వత్ర వ్యాపించియుండు అట్టి జీవకళను అనుభవించుటయగుచున్నది. ఏ మానవుడైతే తనయందలి జీవకళను, ఆత్మను తన ఆంతరమున పూర్తిగను, పరిపూర్ణముగను అనుభవించగలిగియున్నాడో, అదియే (ఆత్మ) ఏకమై సర్వము వ్యాపించియుండుటవల్ల, అతని ఆత్మ సాక్షాత్కారము సత్యజ్ఞానము శాశ్వతము. అమృత స్వరూపము, సత్యము, అని తెలియవలెను. ఇట్లు అన్ని జీవరాసుల యందలి జీవకళను కనుగొనిన మానవుడు. ఆ కళయే తనయందున్నదని తెలుసుకొనుటవల్ల, అతఁడు ఒక ఋషి, పైగంబరుడు, దేవమానవుడు. ప్రజలకు చక్కని నాయకుడు. బ్రహ్మాండమునకంతయు దారి చూపగల శక్తి స్వరూపుడుగా నుంటున్నాడు.

ఇట్లు అనుభవించగలుగుటవల్ల, అట్టి మానవుడు తనయందలి మానసిక భావములగు ద్వేషము, జుగుప్స,

అసూయ, భయము, క్రోధము మొదలగు దుర్గుణముల వల్ల తొలగించుకొనుచున్నాడు. ఈ భావము లన్నియు భిన్నాభావము. ద్వంద్వ స్వభావము కనుగొనుటవల్ల మన పరిసరములలోనున్న వస్తువులయందు విరోధము ఏర్పడుచున్నది. మనసునందలి జుగుప్స తొలగిన వెనుక, అట్టి మానవుడు అనుకూల, అననుకూల, సర్వ అవస్థలయందును, నిరంతర, శాశ్వత శాంతమును అనుభవించుచుండును.

ఇట్టి మనోభారమునుకూడ, "సమత్వము" అను భావమును తెలుపుచు వర్ణించబడియున్నది. శ్రీ అరవిందఘోష్, తన ఈశా ఉపనిషద్‌నందు అనుబంధ సూచకముగా యొక పుటయందు ఇట్లు వివరించియున్నారు. "జుగుప్స అనునది మానవుని సంకుచిత ఆత్మ నిర్మాణమునకును, బాహ్యమునకు సంపర్కము వలన కలుగు దుఃఖ ఆవేశమువల్ల మనసులో శాంతము కలుగలేదను విసుగును అనుభవించుట. ఇది దుఃఖముగను, భయము, ద్వేషము సుఖరహితము, లేక దుఃఖానుభవముగా పరిగణించుచున్నది. అది కోరిక, మమకారములకు కారణభూతమైన ఆకర్షణ వ్యతిరిక్తము, ద్వేషము, ఆకర్షణ, రెండును తొలగిపోయిన మనకు సమత్వమే మిగిలియుండును"

మానవవ్యక్తి, తనయొక్క ఆందోళనలవల్లనే ఈ ప్రపంచ సంఘటనలయందు అసమర్థత, అపూర్ణత ప్రకటించుచున్నాడు. ప్రశాంత మనసు, దైవమువంటి శక్తి సంపన్నమయి యుండును. అందువల్ల మన జీవితములు ఆనందకరముగను, పరిపూర్ణతయు కలిగియుండును. దీనికి ముఖ్యశత్రువు మన జుగుప్స. కనుక, మానవుడు తన దైవ స్వరూపములను ఎంతటి సులభముగా ప్రకాశింపవచ్చునో తెలుసుకొన సాధ్యముగానున్నది. ఇందుకు దివ్యజ్ఞాన సంప్రాప్తి విధానమును అనుసరించి, తనయందలి మనో వికారమగు జుగుప్సను తొలగించుకొనవలెను.

అసూయ, ద్వేషము, కుత్సితనము, ప్రేమరాహిత్యము, భయము, ఇవన్నియు ఒకనికి తనవల్లనే కలుగదు రెండవవ్యక్తియే వస్తువో ఒకటి యుండవలెను. విజ్ఞానకోశ "నేను" మానవసంకోశ "నేను"ను ప్రేమించలేకపోవచ్చును, ద్వేషించవచ్చును, లేక దానివల్ల భయపడవచ్చును. ఇవన్నియు ఒక్క స్థలమున, ఒక్క కాలమున సంభవము. ఇందుకూడ ద్వైత భావము పూర్తిగా నున్నది. ద్వైతము–లేక రెండవది–అనునది–జుగుప్స కలుగుటకు ముఖ్యకారణము. కాని మనము అద్వైతమును తెలుసుకొని అనుభవించ గలుగుచుండినయెడల, అనుభవమునందు మరిమరి స్థిరత్వము పొందుకొలది, ఆత్మ తప్ప వేరు లేనందున ఈ రెండవది అను భావమునకు ఆస్పదములేకున్నది.

ఈ రెండవది లేక ద్వైతము అనునది వెళ్ళిపోయిన యెడల మనోవికారమగు "జుగుప్స" కూడ మనసు నుండి మాయమగును. ఇది యే మహాఋషులు తెలుపు గొప్ప గమ్యస్థానమగు పరిపూర్ణదశ. ఇట్టి శాస్త్ర సమన్వత సత్యపదవిని, వేదాంతమున తెలిపియున్నట్లు ప్రపంచమున ఇతర మతధర్మములలోను తెలుపబడి యుండలేదు.

(సశేషము)



# తెల్లరోజా!


రచయిత్రి :
ఇన్‌గే షోల్స్

అనువాదము :
డాక్టరు వి. ఎన్. శర్మ


## III

ఆ రోజులు జర్మను ప్రజానీక చరిత్రలో - అంతేనా మరి? - ప్రపంచ చరిత్రలోకూడా చీకటి రోజులు. గాఢాంధకారం తను చేయాలసిన కార్యాన్నంతా తూచాగా చేయసాగింది. ప్రజలు అనుదినమూ ఎదుర్కొనాలసివచ్చిన కష్టపరంపరలకి లెక్క వుంటేగా! జర్మనుజాతి అనాదినుంచి ఎన్నో కష్టాల్ని అనుభవిస్తూ వస్తూవున్నా, ఇట్టి విపరీతపు వుప్పెనను మాత్రం ఇంతవరకు ఎదుర్కొన్నది కాదు. నిస్సహాయత - ఎక్కడచూసినా నిస్సహాయతతో ఆబాలగోపాలం వుక్కిరిబిక్కిరయి పోసాగారు. ఇలా ఎంతకాలం ఇట్టి దుర్భరావస్థలో ఆ జాతి వుండిపోవాలసివస్తుంది? దాని వాతకి అందరూ ఆహుతి కావాలసిందేనా? ... లేక దాన్ని ప్రతిఘటించి జాతి ధర్మాన్ని నిలువబెట్టడానికి తరణోపాయం అనేది ఏదైనా వుందామరి? ఇట్టి విపరీత సంఘటనల్లో దీన్నేకదూ మనం ఆలోచించాలసింది.? ఒక ఆలోచనతో సరిపోతుందా ఈ పని? ఆ ఆలోచనల్ని ఆచరణలో బెట్టడానికి కార్యరంగాన దిగటానికి అదురూ బెదురూ లేకుండ ముందుకు నడవాలి. అప్పుడే చీకటి పటాపంచలైపోతుంది. అరుణోదయం తనంతట అదే ప్రారంభమవుతుంది. ఈ కాలంలో మానవుడు గుర్తించాలసిన బాధ్యత ఇదే. ఇతర్లు అతనికి ఈ సంగతి చెప్పాలా? అతడే ఈ బాధ్యతని అవగాహనంచేసుకోవాలి. అప్పుడే అతని జీవితం పావనమవుతుంది. జగన్నాధరథమూ అతని శక్తిసంపద మూలాన అవలీలగా ముందుకు కదలటానికి ప్రారంభమవుతుంది. ...

అట్టి విషాద దినాల్లో హాన్స్ మ్యూనిచి నగరానికి వచ్చాడు. ఆ నగరానికి హాన్స్ కొత్త. ఆ రోజుల్లో కొత్తవారిని నగరవాసులు ఆప్యాయంగా ఆదరించేస్థితిలోవుంటేగా! వాళ్ళ గొడవల్నే నెమరు వేసుకోనడానికే అదృష్టంవుంటేగా?... ఇక పరాయి వాళ్లనిచూశారా గడగడ వణకిపోయేవారు. తమకు వున్న బాధలుచాలు. కొత్తవాళ్ళ మూలానమరే బాధలు వస్తాయో ... ఎవరికి తెలుసు ... అంచేత హాన్స్‌కి మొదటి రోజుల్లో ఎంతో కష్టంగా వున్నదని చెప్పటం అనవసరం. అతడు చదవాలసినది వైద్య శాస్త్రం. ఆ శాస్త్రంలో మ్యూనిచ్ విశ్వవిద్యాలయం ఎంతోపేరు ప్రతిష్ఠల్ని గాంచిన కళామందిరం. తనతో ఈ విద్యను చదవటానికివచ్చిన విద్యార్థులు కొద్దిమందే. వాళ్ళతో పరిచయంచేసుకోనడం ఆ రోజుల్లో అంత సులభమైనకార్యంకాదు. రోజులు మంచివికావు. మౌనవ్రతమే ఆ పరిస్థితుల్లో ఆత్మరక్ష. కాని దాన్ని ఎంతకాలం భరించగలుగుతాడు? ఆ విషాద పరిస్థితుల్ని చూస్తూవుంటే పాత రోజుల్ని హాన్స్ ఎలా మరచిపోగల్గుతాడు? ఈ రోజులువేరు. ఆ రోజులు వేరు. ఇవి వాటికన్నా దుర్భర భూయిష్టాలు. అహోరాత్రాలూ ఈ వాతావరణాన్ని వెయ్యి కళ్లతో చూస్తూ వుండాలి. అలా చేయటానికి కొంచెం అశ్రద్ధచేశాడా వ్యక్తి ఆ వాతావరణం మూలాన అనుభవించాలసిన అష్టకష్టాల్ని మాటలతో వివరించటం మన తరమా?

హాన్స్ స్వభావరీత్యా మితభాషి. తన పనేమో దాన్నే నెమరువేసుకోనేవాడు. ఆపనిని నిర్విఘ్నంగా కొనసాగించటానికి ఏమాత్రం వెనుకంజవేసే తత్త్వం కాదు హాన్స్‌ది.

ఎట్టి పరిస్థితుల్లోనైతేనేం హాన్స్‌కి తన మనోభావాలకి అనుగుణ్యంగా నడిచే వాళ్ళతో పరిచయం

కలగటం ఆ కాలాన అతని అదృష్ట భాగ్యమనే చెప్పాలి.

అది చలికాలం. ఆరోజుల్లో ఆ చలిబాధనుంచి తప్పుకోడానికి తోడివిద్యార్థులకిమల్లె హాన్స్ అవలంభించాలసివచ్చిన భగీరథ ప్రయత్నాలు వివరించడం అనవసరం. ఎవరికివారే యమునాతీరే అనే వాక్యం ఆ రోజుల్లో ఆ నగర దుర్భర పరిస్థితుల్లో సార్థకమైనదనే చెప్పవచ్చు... ఒకరోజున ఒక ముసలాయన హాన్స్ఆకష్ట పరంపరల్లో మునిగి తేలడం చూశాడు. అతన్ని పలకరించాడు. తన ఇంటికి అప్పుడప్పుడూ వస్తూవుండమని హాన్స్‌ని కోరాడు ... అయన నిజంగా హాన్స్‌ని ఆ దుర్భరావస్థనుంచి దరిచేర్చడానికి అవతరించిన దేవతే అని చెప్పినా తప్పేమీ వుండదు. ఆ దైవ సంఘటనతో హాన్స్ జీవితంలో జరగాలసి మార్పు జరిగింది ... ఆ ముసలాయన విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరని తెలుసుకొన్నాక హాన్స్ ఆనందాన్ని ఇక పట్టటానికి పగ్గాలు కావాలా! ఆ ప్రొఫెసరు ఇల్లు ఆ రోజునుంచి హాన్స్ స్వంత ఇల్లయిపోయింది. తనకి ఇష్టంవచ్చినప్పుడల్లా అక్కడికి వెళ్ళవచ్చు. ఆయన ఆతిథ్యాన్ని తనివితీరా పొందవచ్చు. అంతేనా? ప్రొఫెసరుగారికి పెద్ద గ్రంథాలయం వుంది. ఎన్నో అమూల్య గ్రంథాల్ని ఆయన సేకరించాడు. హాన్స్‌కి గ్రంథాలంటే పిచ్చి. తనకి నచ్చిన పుస్తకాలు లభించాయా—వాటిని చదవటంలో ఇతరవిషయాల్ని మరచిపోయేవాడని చెప్పడం అనవసరం. అక్కడే ఆ ప్రొఫెసర్ గారిని కలుసుకోనటానికి తరచుగా వస్తూవున్న కవులతో, పండితులతో మరి ఎంతోమంది విద్యావేత్తలతో హాన్స్‌కి పరిచయ భాగ్యం లభించింది. తనకి తెలియని ఎన్నెన్నో విషయాల్ని వారిదగ్గర నేర్చుకొనే అదృష్టమూ ఆ దినాల్లో హాన్స్‌కి లభించింది. అంత అదృష్ట భాగ్యం ఆ రోజుల్లో తనకు లభించి తన జీవితపు పంథానే మార్చగలదనే సంగతి హాన్స్ కలలోకూడా తలంచినవాడు కాదు.

ఇట్టి పరచయభాగ్యం ఒక పండితవర్గంలోనే కాదు ఆ అబ్బాయికి లభించడం. ఆ ప్రొఫెసరుని చూడడానికి వచ్చే తోడి విద్యార్థులతో స్నేహభాగ్యంకూడా హాన్స్‌కి లభ్యింది. అట్టి విద్యార్థుల్లో చాలా మంది హాన్స్‌కిమల్లె దేశాన్ని, ప్రజాకోటిని ఆ నాటి అంధకారంలోనుంచి, అసహాయావస్థ నుంచి దరిచేర్చటానికి శతవిధాల సేవచేయటానికి ఉత్సాహంతో, ఉన్నతాశయాలతో ముందుకు రావాలని వాంఛించేవారే. ఆ కార్యసాధనకి ఎట్టి కష్టాలను ధైర్యసాహసాదులతో ఎదుర్కొనటానికి బద్ధకంకణులయినవారే.

(సశేషము)






శ్రీ వి. కె. దాసరి

కళ అంటే ఏమిటి? ఎటువంటిదాన్ని కళ అనాలి? ఎవరు నిజమైన కళారాధకులు? మన నిత్య జీవితంలో కళ ఎట్లా వుపయోగిస్తుంది? ఇవీ ఈ నాడు ముఖ్యంగా ప్రతీవాడికీ కళ అనగానే కలిగే సంశయాలూ - ప్రశ్నలూనూ.

నిజమాలోచిస్తే ప్రస్తుతం కళయడల జరుగుతున్న అన్యాయాల్ని బట్టి చూస్తే దీనికి బలవత్తరమైన కారణాలు చాలా వున్నాయి. దీనంతటికీ కారణం- పాశ్చాత్యులూ — వారి అజేయమైన పరిపాలన. ఇప్పటి కళయొక్క దీనస్థితి చూసి విచారించి పూర్వం మనదేశం ఏ ఏ కళాయుతమైన పరిశ్రమలతో శోభిల్లిందో ఆ చరిత్రనంతా ఒక్కసారి మనం పునరావలోకనం చేసి చూసినట్టయితే మనదేశాన్ని సుశ్లాఘతశోభకు తేగల్గే ప్రధానాంశాలు మనకి కనిపిస్తాయి. వాటినాధారంగా మనం పునాది వేసుకొల్పితే మనం తప్పక గమ్యస్థానం చేరుకోగలం. అవే మనకు మొదట్లో కలిగిన ప్రశ్నలయొక్క సమాధానాలు. వాటిని గూర్చేమనం యిక్కడ ప్రస్తావించుకోవాల్సింది.

ఉత్తమమైన కళ ఎప్పుడూ స్వతంత్రంగా బ్రతకగల్గదమే. ఇది సూత్రప్రాయమైన సమాధానం. ప్రస్తుతం దేన్ని కళ అనాలి? అనే శంక కలగడానికి కారణం — దాని ముఖ్యసూత్రాల్ని నిరుపయోగమైన డాబుదర్పాలతో మరుగు పరచటం. అసలు కళాసాధనం యింతవరకూ క్రమమైన పద్ధతిలో చేయబడలేదు. అనుభవంలేని కొత్త పద్ధతులవలింభించుటవల్ల నిజమైన సాధన మృగ్యమైంది. అనవసరమైన డాంబికంవల్ల కళనిజస్వరూపం మలిన పడ్డది. ఈ విధమైన దుర్గతి మన దేశంలో తప్ప మరేదేశంలోనూ లేదనుకొంటాను. ధనికుడు ఒకడు సుందర సౌధం కట్టించి లోపల అలంకరణ — చిత్రపటాలు మొదలైనవి తగిలించినందువల్ల మనం అతన్ని ఒక కళారాధకుడు అనలేము. అలాగే మరొకడు అందవికారంగా యిల్లు కట్టించి అనవసరమైన అలంకారాలన్నీ చేస్తాడు — వీరనుకోవటం వారు చేసే ప్రతీ పనిలోనూ మంచి కళ వుందని! ఒక తోటమాలి చక్కటి పూలతో మాల తయారుచేసి భక్తితో దాన్ని దేవుని కర్పిస్తాడు. ఇతనిలో నిజమైన కళవుంది. ఇతనిలోని నిష్కపటం, ఆదర్శయుతమైన భక్తి, ప్రేమ, నిరాడంబర జీవనం — ఇవీ ముఖ్యకారణాలు. తన స్వల్పమైన పనిలోనే ఆనందాన్ని పొందుతూ, తనకు తెలిసినంత, తనకు నేర్పువున్నంతలో, అమితలాభాపేక్షలేక — ఉత్తమమైన పనితనం కనపరచే ఒక కష్టజీవిలోనూ, కార్మికారునిలోనూ అసలైన కళవుంది.

ప్రతిమనిషికీ ఆహారము, వస్త్రము యిల్లు ఎంత అవసరమో విజ్ఞానయుతమైన కళగూడా అంత అవసరం. ఆ విజ్ఞానం సంపాయించటం చాల కష్టం. కాని అందుకోసము మానవుడు ఆజన్మాంతం ప్రయత్నిస్తూవుంటాడు. అతడు సంపాయించిన విజ్ఞానం ఆనందమయం చేయటానికి సౌందర్యం ద్వారా కృషిచేస్తూంటాడు. కొన్ని పాటలు పాడితే పసిపిల్లవాడు నిద్రపోతాడు. కొన్ని కొన్ని రంగులు చూచి ఎంతో ఆనందిస్తాడు. కనుక మనిషి ఎక్కడ మంచి రంగువున్నదా అని అన్వేషిస్తుంటాడు. అసలు సృష్టికర్తతో పంతం వేసుకొని పనిచేసేవాడే కళాజీవి. కళఅంటే సౌందర్యం

ద్వారా ఆనందం పంపాయించి తద్వారా శాంతిని పంపాయించటమే. కళారాధకుడు సౌందర్యం ద్వారా పొందే ఆనందాన్ని తాను అనుభవించి యితరులకు పంచి పెడ్తాడు. కతేమో - కళ్లకు కన పడని, చెవికి వినిపించని వానిని కూడా ఊహించి నవ్య జగత్తునే సృష్టించుకొంటాడు.

కళ కేవలం ప్రత్యేకంగా ధనికులానందించుటకే ఏర్పడలేదు. మామూలుగా అందరూ అనుకొనే దేమిటంటే కళ ఒక్క భోగజీవుల కోసమే నిర్దేశింప బడిందని. అలాంటప్పుడు అది మన అందుబాటులో వుండాలంటే ఎలావుంటుందీ అని. ఇలా అనుకోటం చాలా పొరపాటు. సంగీతం, సాహిత్యం, చిత్ర రచన — ఈ విధమైన లలితకళలన్నీ — ఇంద్రియ సంబంధమైనవనీ మునీశ్వరుల నమ్మకం. ఈ అభి ప్రాయంగూడా అబద్ధం.

“కళ సరిగా ఆరాధించబడ్డప్పుడు దివ్యత్వాన్ని తెలుపుతుంది” అని అక్బరు వెల్లడించాడు. నిజంగా కళని మనం సరైన పంథాలో సాధన చేసినట్టయితే — మానవస్థితిలోకి పూర్తిగా తీసుకొచ్చినప్పుడు ఆధ్యాత్మిక చింతనాన్ని అభివృద్ధిచేసి దివ్యత్వాన్ని మన కళ్ళ ఎదుట కట్టించే అద్భుతశక్తి కళలకువుంది. ప్రతీ మానవశక్తీ, ప్రతీ ప్రవృత్తీ దాని నిజమైన పనిని తెల్సుకోలేకపోతే తప్పక వక్రమార్గము పడుతుంది. అందువల్ల కళనే నిందించడం — ఇంకా శోచనీయం. కళ అందరి అందుబాటులో వున్న సాధనం — ఇది మంచీ — ఇది చెడూ అనే విచక్షణ శక్తినిచ్చేసాధనం. జీవితంలోని ప్రతి పోకడలోనూ అత్యద్భుతమైన ఫలితాలనిచ్చే ఆదర్శమైన సృష్టి — కళ! అదే దివ్యజ్ఞానం. కళాకారుడు క్షోభిస్తూవుంటే దేశానికి శ్రేయస్సుండదు. పుస్తక జ్ఞానం తప్ప సహజమైన జ్ఞానం లేకపోవుటవల్ల ఎవడైనా తెలియనివాడు వెళ్లి తనకు తెలియని విషయాన్ని గూర్చి అడిగితే వాళ్లు చెప్పేవి ఏమిటంటే — తాము విశ్వవిద్యాలయాల్లోనూ కళాశాలల్లోనూ చదువుకున్నవీ, తమకి జ్ఞాపకంవున్నవీ, తమకే అర్థంకానివీ చెప్తారు. తెలియని వాణ్ణి తెలియనట్టుగా వదల్తు — ఒక నదీ సముద్రంలో పారేస్తారు! ఎప్పుడూ మానవానీకాన్ని జ్ఞానంవల్ల కొత్తకొత్త అనుభవాల్లోకి చొరవచేసుకొని ముందడుగు వేయ సమర్థత నిచ్చేది అసలైనకళ. ప్రపంచాన్నంతట్నీ నిత్యమైన సామరస్యంలో ఉంచేది కళ. ఆ కళని మనం సరిగ్గా వుపయోగించినపుడు, మన వ్యక్తిగత జీవితాల్లో కూడా చక్కటి సామరస్యం కలుగుతుంది. కళని యింకా మనం గూఢమైన విషయాల్లోకి తీసుకు వెడితే మూడు ముఖ్య సూత్రాలవల్ల నిలబెట్టాలని తెలుస్తుంది. యుక్తత (Fitness.) సౌందర్యం (Beauty) - ఇది కాక పోతే లయ (Rhythm) ప్రేమ (Love) - ఇది కాకపోతే ఆరాధన (worship) మానవుడు జీవించాలంటే ఆహారపానాదులుకావాలి. అలా వున్నప్పుడు మనిషి ‘యుక్తత’లోవున్నాడనాలి. దీనిని దాటి ముందుకు పోతున్నకొద్దీ సహజంగా మనిషికి కలిగేది సౌందర్యం. దివ్యధర్మాలతోకూడి మానవజీవితం — తన విశిష్టతను అర్థం చేసుకొంటూ పోగాపోగా మనిషికి గోచరమయ్యేది — ప్రేమ. ఆ ప్రేమ అత్యుత్తమ ఆవేశాల కాటపట్టు.

ప్రతీ యుగంలోనూ, ప్రతీ దేశంలోనూ జాతీయాభివృద్ధి కలుగుతూ వచ్చిందంటే ముఖ్యమైన ఈ మూడు సూత్రాలను జోడించి కళను సాధన చెయ్యబట్టె కళారాధనలో. ఈ మూటిలో ఏ ఒకటి లోపించినా జాతీయతకు పతనం ఖాయం. ఇక జీవం పోయిన కళలో ప్రేమ ఏముంటుంది? మతాన్ని వీడి, కేవలం ప్రాపంచికమైన విషయాన్ని ప్రధానం చేసుకొని కళని వుపయోగించటంవల్ల ఆ నాటి ఇటలీలోని కళావైభవం పూర్తిగా దెబ్బతింది. దానికి కారణాన్ని గ్రహించి యిప్పుడు పాశ్చాత్యులు పునరుద్ధరించడానికి యత్నిస్తున్నారు.

మొట్టమొదట మన దేశంలోకూడా పైకారణాల వల్లే పతనం వచ్చింది. మొఘలాయిల పరిపాలనంలో కళ ఉచ్ఛస్థితిలో విరాజిల్లినప్పటికీ అది వెంటనే పతనమైంది. కేవలం దర్బారుల ఊప

యోగంకోసం కళావిశిష్టత మలినమైంది. ఆనాటి కళలో ప్రేమ, సౌందర్యంవున్నవి. కాని, అది విశ్వవ్యాప్తమైన ప్రేమకాదు ; కేవలం స్వార్థ వ్యక్తిగత ప్రేమ. నిజంగా గొప్పదైన కళ ప్రజల్లోకి చొచ్చుకుపోతుంది. అది కేవలం ఉత్సవాల్లోనూ, దర్బారుల్లోనూ కనిపించదు.

కళయొక్క ప్రారంభదశ ముఖ్యంగా — శుభ్రత, మర్యాద, క్రమపద్ధతి — ఈ మూడింటిలోనూ వుంది. మనం శుభ్రంగానూ, మర్యాదతోనూ, క్రమపద్ధతితోనూ నడచికొంటే చాలు — మనం కళ యొక్క మొదటి మెట్టు ఎక్కామన్నమాట. కళ విషయంలో — ముఖ్యంగా నాటకకళ విషయంలో ఆంధ్రులు చాల ముందుకు పోతున్నారు. సంగీతంలో తమిళులు ముందున్నారు. ఇదీ ఒకందుకు బాగానే వుంది. కళలు రాణించటానికి ప్రజాదరణా, ప్రభుత్వాదరణం — వుండాల్సిందే. చిరస్థాయిగా వుండేది కళాజీవుల కృషి మాత్రమే. ఒకప్పుడు మనం కళాసామ్రాజ్యాన్ని నిర్మించుకున్నాం. కాని నేడు విస్మృతవైభవం అయింది. దాన్ని మరల పునరుద్దీపింపచేయాలి. అది కేవలం ప్రభుత్వం వల్లకాదు. ప్రభుత్వం అంటే ప్రజలే. ప్రజలకోసం ప్రభుత్వంవుందిగాని ప్రభుత్వం కోసం ప్రజలులేరు. కనుక కళల పునరుద్ధరణకు కృషి చేస్తారని ఆశిస్తాను.

---



"రాత్రి అంతా మా అమ్మ, నాన్న కలలో కనుపించారండీ — ఎలాగున్నారో ఏమోపాపం! ఒకమారు వెళ్లిచూచి రావాలనియుంది"

"రాత్రి అంతా వాళ్లను చూచావు కదా చాలదూ!"

♦ ♦ ♦

"సఖూ! యీ చీర తీసుకో మంటావా!"

"బలేవారు మీరు — మీకెప్పుడూ మంచివి కనుపించవు"

"అయితే నీవనేది ఏమిటి? నేను ఎంచే దల్లా మంచిదికాదనా?"

"అంతే"

"అయితే నిన్ను పెండ్లాంగా ఎంచు కోడంకూడ పొరబాటే"

ఆర్. యస్. లక్ష్మి

# పతిభక్తి

శ్రీ సోమయాజుల శ్రీరామదత్తాత్రేయశర్మ

(ద్విపద కథానిక)

శ్రీ జగన్నాథుడా-శ్రితజనపోష
పూజించి రచియింప - పూనితినయ్య!
ముందుగా విఘ్నేశు - మోదకప్రియుకు
వందనం బిడియెద - వందలు వేలు
చతురాస్యునురాణి - చదువులబోణి
మతినెంతు నాజిహ్వ - మసలంగ కోరి
గురువుల గురువుండు - కులదేవగురుడు
గురుదత్తాత్రేయుని - కోరిభజింతు
యామీద పతిభక్తి - యనుశీర్షికనిడి
సామి యాజయదేవు - సతిగాధ చెపుదు.

♦ ♦ ♦

భవనాలు మేడలు - బారులుతీరి
సువిశాలవాడలు - సోయగమొదవ
వాడవాడలపూల - వనములుగలిగి
వడిలేని గంధంపు - వాయువువీవ
నవతుల పోర్మాని - చదువులపడతి
కవగూడి సవతితో - కాపురముండ
పండితకోటులు - పలుకు చతురులు
దండిగాగలవారు - ధనవంతులెచట ?
యోగులభోగుల - యూర్జితయశుల
త్యాగుల భక్తుల - తతులుండె నెచట ?
శ్రీ జగన్నాథుడు - శ్రీ సతితోడ
రాజిల్లు నెచ్చోట - రాణువమీద
యోజన పరిమితి - నొప్పారు పురము
శ్రీ జగన్నాథము - చెన్నారు ధరణి,

ఆపురి బాపల - నందరిలోన
చూపట్టు పండిత - సూరివరుండు
సంపద్విలసితుడు - సద్భక్తివరుడు
సొంపగు తేజస్వి - సుందరగుణుడు
శ్రీ జగన్నాథుని - సేవించుచుండు
రాజయోగివరుల - రత్నంబతండు.

పారునకుదయించె - బాలిక యొకతె
పేరు పద్మావతి - గారాలకూచి
శోభనాంగి మిగుల - సుగుణాల రాశి
రంభనపహసించు - రమణీయమూర్తి.

వగగుల్కు పావురా - పలుకుఘసందు
సొగసైన జింకల - చూపుచపలత
గురువైన వట్రువ - గుబ్బల కులుకు
పిరుదల మసలెడి - పెన్జెడ తళుకు.
అందాల చిందుల - నలరించె వయసు
అందాల రాణించు - నందరు పిల్ల.

పిల్లను వరియించి - భేషైనవరులు
యుల్లంబు తెల్లంబు - యొనరించిరంత
కట్నాలు కానుకలు - కావలెననరు
పట్నంపు చదువులు - భరియింపమనరు
పెండిలి ఖర్చుల - బెడదకు హారె
నండగానుండుము - ననబర్గిరంత.

ఈడుమీరెనుపిల్ల - యింకేటితలపు
వేడుకొందును వేగ - పెండ్లికినొప్ప.

ఏయీడుకాయంద - మేకొనవలదె
దాయాదివరులెల్ల - తగనవ్వుచుండ్రి,
అనియంగలార్చెను - ననుకూలవతియు
వినిపించుకొనదేమి - విప్రుడో యతడు ?
అవకాశ మొదవిన - సవరించుకొనడు
అవివేకి యితడంచ - పహసించిరెల్ల
చుట్టాలు బంధులు - సుగుణాలహితులు
గట్టిగా నుడివిరి - కల్పించుకొనుచు.
అడలించి వారికి - బదులాడెనిటుల
యెడలోని తలపులు - ముదమూరద్విజుడు.
నాసామి నన్నేలు - నాదేవదేవు
దోసాలుపోకార్ప - తులలేనివాడు
కొలచినవారల - కొంగు బంగారు
పిలిచినవారల - పెన్నిధియనగ
జగతిలో విలసిల్లి - జననుతిగొన్న
జగన్నాథున కేను - సద్భక్తిమీర
కొమరితనియ్యంగ - కృతనిశ్చయుండ
తమ రేమినుడవొద్దు - దయజూపుడనిమె.
ఆ పల్కు లాలించి - నవ్వార వెల్ల
ఏపల్కు పలుకకె - యిలుసేరిరంత.
పారుండు భక్తుండు - భగవానునమ్మి
గోరంత మగతతో - కునికేను నిద్ర,
కలలోన పరమేశు - కమనీయమూర్తి
చెలువెల్ల జూపించి - చెప్పెను నిటుల.
తనజన్మ తరియింప - ధరలోన నెవరు
కనులార భగవాను - కాంచిన ఘనులు ?
అయ్యారె ? నతడెంత - నదృష్టపరుడొ ?
అయ్యారెన ! తడెట్టి - యనఘుండొ
ఘనుడొ

పారుడా ! భక్తుడా ! భగవంతు నేనె
గారాల నీ పుత్రి - కడుధన్యురాలు,
గారాల నీ పట్టి - కట్టంగ నాకు
మా రాముచేయకు - మారాడబోకు.
నా పల్కు లాలించి - నయమొప్ప నీవు
నీ పట్టి పెండిలి - నెరవేర్చవయ్య!
తిందుబిల్వమునందు - తేజస్వి ఘనుడు
సుందరుండతులిత - సుగుణాలరాశి
భక్తుండు పారుండు - పండితుండరయ
యుక్తంపు వయసున - నున్నాడు వరుడు
"అష్టపది" రచించి - నతిభక్తిమీర
నిష్టతో నర్పించె - నెనరంగ నాకు
దానిని పఠియించి - తరియించుచుండ్రి
పూనిక సద్భక్తులు - పుణ్యులు నేడు
గీతగోవిందుడు - పూతచరితుడు
కూతునిడి మదీయ - కోరికదీర్చు
దేవతాగణమును - దివ్యర్షితతులు
దీవెన లిత్తురు - దిక్పతులెల్ల
తరియింతు వీవును - ధన్యుడవగుదు
జరిపించు పెండిలి - జయదేవుతోడ !
అని పల్కునంతలో - కనులిచ్చె
ద్విజుడు
కనుపడరెవ్వారు - కలయని తెలిసి
భార్యతో కలతీరు - వర్ణించిపలికి
కార్యానుకూలత - కలుగంగనేగె
తిందుబిల్వముజేరి - తేరునుడిగ్గి
సుందరు జయదేవు - మందిరముగనె.
తనుగన్న కలతీరు - వినిపించివార్కి
తనుజాతనీయంగ - తాంబూలమిడియె.

బంగారు గజ్జెల్ల - భరతంపురవము
మంగళవాద్యాల - మంజులస్వనము
పండితులకవుల - పలుకులసవడి
పెండిలి పందిరి - పెంపారుచుండ,
వేదాలనిధియైన - విప్రుండుచెలగి
వేదోక్త మంత్రాలు - వివరించుచుండ
దేవతాతతులెల్ల - దీవెనవిడుచు
పూవులు వెదజల్ల - పూబోణి మెడను
పుత్తడి సూత్రంబు - హత్తించెవహ్వా,
నత్తరివ జయదేవు - కుత్తుకన్ప్రేమ
ముదమార సుమమాల - గదియించు తరిని
రాధమాధవులోలె - రాణించెవారు.

♦ ♦ ♦

ధర్మంబు తప్పక - ధరణిపాలించు
నిర్మల హృదయుండు - నేస్తుండురాజు
భక్తుండు శిష్యుండు - పరమయోగ్యుండు
భుక్తినివాసాలు - పొలుపొందగూర్ప.
జయదేవ పద్మలు - జననుతిగొనుచు
ప్రియమార కాపురం - బెలయింపుచుండ్రి,
ఆ రాజ దంపతు - లధికంపుచెలిమి
గారవములుజూప - కవిదంపతులకు
రాజభవంతికి - రాకలుహెచ్చె
రాజిల్లుచెలువెంతొ - రాణువతోడ.
సుందర సుమరాశి - శోభిల్లునట్టి
మందిర ప్రాంగణ - మండలితోట
నాతోట నడుమను - నలరారుభళిర
వెలబాపు రమణీయ - వేదికనొకటి
నావేదికందున - నాసీనయయ్యె
దేవేరి మహారాణి - దివ్యతేజస్వి.
కవిరాజు జయదేవు - కాంతయునాపె
కవగూడి సరసాల - కవ్వించుచుండ
చెలికత్తెలెల్లరు - సింగారమలర
తలపులు నెరవేర్ప - తన్నంటినిల్వ
చుక్కల విలసిల్లు - రిక్కలరాణి
కక్కజ మొడగూర్చె - చక్కదనాన,
ఆ వేళ వేదిక - నలరారువేళ
దేవేరి మహారాణి - దివ్యతేజస్వి.
అంతలో నొకభటు - డరుదెంచెనటకు
వంతల సూచించు - వదనమ్ముతోడ
వార్తల నందించు - వానినిగాంచి
వార్తలేమిటి? చెప్ప - వచ్చితివోయి
యని ప్రశ్నజేసెడు - నవ్వారికతడు
వినయాన జయవెట్టి - వివరించెనిట్లు.
జయదేవ నుతతేజ - జయమమ్మ జయము
జయశీలి మహారాణి-జయమమ్మ జయము,
జనియించువారెల్ల - జముతోడనేగు
పనివీడదమ్మరో - వగవంగరాదు
తమ సోదరుండగు - ధనరాజునిన్న
సమవర్తి గొంపోవ - జనెనమ్మదివికి
"ధవుబాసి మన్నంగ - ధర్మంబుగాదు
భువిలోన లలనకు - పుణ్యంబులేదు"
అనునీతి తలపోసి మనమందురోసి
వనితలకాదర్శ - వంతురాలగుచు
సహధర్మచారిణి - సన్నుతిమీర
సహగమనంబును - సాగించెభళిర!

యనిచెప్పి నతఁడేగ - తనదారి వెంట
పనితీరె నంచని - మనమందు నెంచి.
గతజీవి ధనరాజు - ఘనతనుపొగడి
వెతదీర్ప విధినెంతొ - వేమరుదూరి
చితిబడ్డ మరదలి - పతిభక్తి మెచ్చి
మితిమీర నుతియించె - మేలుభళిరని.
చెలువెల్ల మహారాణి - చింతనుబాప
పలికిరి యోదార్పు - వచనమ్ములెన్నొ ?
విలపించు రారాణి - వెన్నంటికూడ
పలుకాడ దేలనో - పద్మావతపుడు
పలుకాడకున్నట్టి - పద్మావతిగని
అలకూని దేవేరి - యడిగేను నిటుల.
లేతవయసువాడు పూత చరితుడు
భూతలేశులలోన - భూరియశుండు
అనుజుని మరణంబు - వినలేదె నీవు
మనమందు దుఃఖంబు - మసలదా నీకు
మరదలి పతిభక్తి - మదిమెచ్చలేద
మరియాద నెరుగవో - మరుపొందినావొ
మది సానుభూతన్న - మాటయె లేద ?
యిదియేమి పలుకవు - యింతవరకును
అని పల్క రారాణి - కా దేవిపలికె
మనమందు నున్నట్టి - మాటలనిటుల.
సానుభూతికలదు - సఖియరో నాకు
దాని ప్రదర్శింప - దలపుండదమ్మ
ముఖమెడమగుతోడ - మూతివిరిచెడు
ముఖమిచ్చకములాడి - మురిపింపనేర
మరదలి పరిహాస - మాడుట కాదు
ధరమీద పతిభక్తి - ధర్మంబె వేరు

పతిచావు చెవిలోన - బడగానె తాము
గతజీవులగుదురు - పతివ్రతలెన్న
సరివారి నెదిరింప - చాలంగలేక
మరియాదకోరకని - మంటదుముకుట
పతిభక్తియంచని - పలుకాడు టెట్లు
నుతిసేయ విలువేమి - మతినెంచిచూడ
పనిగొని ప్రశ్నింప - బదులాడవలసె
మనమందు వేరొక్క - మాదిరెంచకుము
అనుపద్మవచనాల - కినిసియు రాణి
కినుకిసు నంతయు - కనుపడనీదు
పతిచావు చెవిలోన - బడగానెయాపె
గతజీవియగునేమొ - కాంచంగవలయు
కనుగొందు పతిభక్తి - కబురులివేమొ
ననువైన సమయంబు - నరుదేరగానె
అని యెంచుతలపోసి - మనమందు రాణి
వనివీడి మహలుకు - పయనించెనంత
చెలులును పద్మయు - తలపుల మునిగి
పలుకేమి లేకనె - యిలుసేరిరపుడు.

◆ ◆ ◆

మహారాజు జయదేవు-మంత్రులుగలసి
విహరింపనేగెను - వేడుకమీర
మహారాణి పద్మలా - మధ్యాహ్న వేళ
సహవాస కత్తెల - సరసాలతోడ
భవనమ్ము దరిపూల - వనిలోన వెలయు
నవరత్న వేదిక - నలరారు వేళ
మహారాణి పనుపున - మాటకారొకడు
బహురక్త పుడుపుల-వణకు హస్తముల

పదిలంబుగాపట్టి - పరువెత్తివచ్చి
రోదన మొనరించి - రొప్పుచుపలికె
తల్లిరో వినిపింప - తప్పదు నాకు
తల్లిరో యుల్లము - తల్లడమయ్యె!
నోటి వెంబడినాకు - మాటరాకుండె
తోటయందలిఘోర - దృశ్యంబునుడువ
గీతగోవిందుడు - గేయాలుపాడ
మాతరో వినుచుంటి - మందరమచట
విను వేళ మనసెల్ల - వివశమందంగ
కనజాలమైతిమి - చనుదెంచుపులిని
గడెలోన మెకమయ్యె - మడియించె
నవ్వుర
మెడయెత్తు నంతలో - దాడులంకించె
కట కటా జయదేవ - కలిరాజునయ్యె
తృటిలోన బెబ్బులి - కబళించె నమ్మ,
విలపించు మహారాజు - విధినెంతొ
దూరు
జలరాశి నోలికించు - జనునెంతొతిట్టు
తలవ్రాత తప్పదు - ధాతకునయిన
విలపింప నేమగు - వెర్రిమాతల్లి!
అని పల్కుచుండంగ - నయ్యయో పద్మ
తనువును చాలించి - తానేగదివికి
మహారాణి పరితప - మానినీ మణికి
నిహలోక మిడువంగ - నెపమాయెనకట!
పతిచావు వినగానె - ప్రాణాలు పోవె
పతిభక్తి కలవార్కి - పద్మావతివలె
సహగమనంబన - సెహబాసురదిర
బహుపుణ్య ప్రదమని - భావింతుదాని

బలిమిని చితిలోన - బడిమెదుదాన్కి
విలువేమిటాచార - విధిపిచ్చిగాక!
చలనమ్ములేనట్టి - శవమూర్తిగాంచి
విలపించె మహారాణి - వేమరు నిట్లు.
అయ్యయే నేనెంత - నవివేకి నయితి
అయ్యయో పాపంబు - నార్జించుకొంటి
సరసాల కవ్వించు - సఖిపోయెనయ్యొ
దురుసయ్యె నా చేత - దుర్యోగమయ్యె
కవిరాజు కోపాన - కనువెర్రజేయు
కవిశాప మదిఎట్లు - గారించునేమో?
బహుకోపి దుర్వాస - బాధచేసెన్ను
మహారాజు విడుచునే - మడియింపకుండ
వినివిలపించెదు - నంతలో పూల
వని నుండి వచ్చిరి - వినిరంత నద్ది
విని నంత మహారాజు - వేగమెలేచి
కినుకచే తనరాణి - దునుమాడబోవు
నాతరి జయదేవు - డుద్దంబు వచ్చి
నాతని - కిల్లనె - నయ్యారె, వహ్వా,
తనసతి జంపిన - తన్వినిగూడ
కనుగొని కాపాడు - కరుణాన్వితుండు
కనపడ డెచ్చోట - ఘనుడీతడంచు
వినుతించిరటగల - విజ్ఞులు భళిర!
నొసటను గలగీత - నుపసంహరింప
పసగల వారేరి - పరికించి చూడ
కోపాన లాభంబు - గూడునా రాజ
తాపంబు దీరునా - తరలాక్షి దునుమ
మహారాణి పన్నాగ - మరయంగనేడు
సహగమనపు ధర్మ - సందేహముడిపె

పాతివ్రతాలోక - పావని యయ్యె
సతిపద్మ - తులలేని-సన్నుతులందె
కోపించి మహారాణి - కుత్తుకదునిమి
పాపంబు చేకొన పాడియా? మనకు,
అని పల్కి-జయదేవు - డా జగన్నాథు
మనమందుతలపోసి - తన యష్టపదుల
గానంబుచేయుచు-కరమెత్తిమ్రొక్కె.
కనువారు కూడను - కడుధన్య తొంద
పరమేశు డచ్చోట - ప్రత్యక్షమాయె
పరమసాధ్విని పద్మ - బ్రతుకంగజేసి
మహారాజు జయదేవ - మంత్రులు సఖులు
బహువిధగతులను - ప్రార్థించుచుండ

కరమెత్తి దీవించి - కనుచుండగానె
పరమేశుడదృశ్య - పరుడాయె - వహ్వా
పరమేశుకనులారా - పరికించిచూచి
పరమేశు దీవెన - బడసిరి వారు
వారెంత సదృష్ట - పరులేమొ వహ్వా
వారెంత భక్తులో వారెట్టి ఘనులో
కాకున్న జయదేవ - కవిరాజు, వారి
సాకునె? దేవుండు - చక్షులబడునె

—: ఫలశృతి :—

ఇక్కథ చదివిన - నిక్కంబుగాను
ఇక్కట్టు లెడబాయు - నెలకొను భక్తి
బలపడు, యున్నత - భావాలు మదిని
తులలేని సిరులింట - తూగాడుచుండు

—(o)—

# గృహ భిదాలను పరిష్కరించే న్యాయస్థానం



న్యూయార్క్ జిల్లావాసుల కుటుంబ సంబంధాలను గురించిన కేసులన్నిటినీ విచారించడానికి గాను న్యూయార్క్ రాష్ట్రపు సుప్రీమ్‌కోర్టు యొక్క అప్పీళ్ల శాఖవారు "కుటుంబ విభాగం" ఒకదానిని ఇటీవల కొత్తగా ఏర్పాటు చేశారు. ఈ విభాగం మరికొన్ని ఇతర రాష్ట్రాలలో వున్న కుటుంబ న్యాయస్థానాల పద్ధతిలో రూపొందించబడింది. ఈ ప్రాంతంలో కుటుంబ న్యాయస్థానానికై సాంఘిక సంస్కర్తలు వెలిబుచ్చుతున్న కోర్కెను ఈడేర్చడానికి ఈ విభాగం చాలావరకు తోడ్పడుతుంది. న్యూయార్క్ రాష్ట్రపు క్లిష్టమైన న్యాయనిర్ణయ విధానాన్ని పునర్వ్యవస్థీకరించడంలో ఇది ఒక చర్య కూడా కావచ్చు.

విడాకుల కేసులు : విడిపోవడానికి, తెగతెంపులకు సంబంధించిన కేసులు, బిడ్డల పోషణ ఎవరికి అప్పగించాలి అనే విషయానికి సంబంధించిన కేసులు, న్యూయార్క్ జిల్లా సుప్రీమ్ కోర్టు యొక్క వివిధ విభాగాలలో ఇంతకు పూర్వం విచారించబడుతూ వుండేవి. అటువంటిది ఇప్పుడు వివాహ సంబంధమైన కేసులు, బిడ్డల పోషణ బాధ్యత అప్పగింతకు సంబంధించిన కేసులు అన్నీ కొత్తగా ఏర్పాటు చేయబడిన కుటుంబ విభాగంలో ఒకే న్యాయమూర్తిచే విచారించబడుతాయి.

భార్యాభర్తల మధ్య అన్యోన్యాన్ని తిరిగి చేకూర్చడం, వారిద్దరూ వ్యాజ్యాలకు దిగకుండా చేయడంకూడా ఈ నూతన కుటుంబ న్యాయస్థానం తన పనిగా పెట్టుకుంటుంది. ఈ న్యాయస్థానం వివాహ సంబంధమైన కేసుల విచారణ జరపడానికి కంటె, వివాహ సంబంధమైన వివాదాలను సరిదిద్దడానికి, తగాదాలను పెంచడానికి కంటె తగాదాలను మాన్పడానికి పాటు పడుతుంది.

వివాదాలను పరిష్కరించివేయడం కంటె, అసలు వివాదాలు ఏర్పడకుండా చేయడమే మేలని ఈ న్యాయస్థానం గట్టిగా విశ్వసిస్తున్నది. గృహభిదానికి కారణమైన పరిస్థితులను సర్దుబాటు చేసుకొనవలసిందని, వివాదపడి వచ్చినవారికి నచ్చచెప్పడం న్యాయస్థాన ప్రధాన లక్ష్యం.

వివాహ సంబంధమైన కేసును దేనినైనా విచారించనున్న న్యాయమూర్తి ఆ కేసును కోర్టుద్వారా విచారించడానికి పూర్వం, భార్యాభర్తల మధ్య అన్యోన్యాన్ని తిరిగి చేకూర్చడానికి ప్రయివేటుగా ప్రయత్నిస్తాడు. వివాద పడుతున్నవారి మధ్య అన్యోన్యాన్ని తిరిగి కుదర్చడానికి సుశిక్షితులైన సాంఘిక సేవకుల సహాయాన్ని, మనస్తత్వ వైద్య శాస్త్రవేత్తల సహాయాన్ని పొందడానికి ఆయనకు అధికార మివ్వబడుతుంది. న్యూయార్క్ నగర న్యాయవాదుల సంఘపు ప్రత్యేక కమిటీ ఒకటికూడా సంప్రతింపులు జరపడానికి అందుబాటులో వుంటుంది. సాంఘిక ఆరోగ్య నిపుణుల సహాయాన్ని అందజేసే విషయంలో కోర్టుతో ఈ కమిటీ సహకరిస్తుంది కూడాను.

కుటుంబ విభాగం ఏర్పడడానికి పూర్వం సాంఘిక సేవకుల సహాయం, మనస్తత్వ శాస్త్రజ్ఞుల సహాయం; మనస్తత్వ వైద్య శాస్త్రజ్ఞుల సహాయం సుప్రీమ్ కోర్టులలో లభించేది కాదు. భార్యాభర్తల మధ్య వివాద మేర్పడినప్పుడు వారి మధ్య అన్యోన్యాన్ని తిరిగి ఏర్పరచడంగాని, అన్యథా పరిష్కరించడం కాని న్యాయమూర్తులు ఎవరికి వారుగా చేసేవారు తప్ప ఒక సంఘటిత పద్ధతిని ఈ పని జరిగేది కాదు. అలా వ్యవహరించడం కోర్టువారి పని కాదని అప్పుడు భావించబడేది.

ఈ తరంలోను, ముందు తరాలలోను కుటుంబీకుల మానసికారోగ్యాన్ని నూతనంగా ఏర్పాటు చేయబడిన కుటుంబ న్యాయస్థానం బాగుపరుస్తుందని న్యూయార్క్ నగరపు మానసికారోగ్య సంస్థ డైరెక్టర్ డాక్టర్ పాల్ వి లెమ్కావు భావిస్తున్నారు. కుటుంబ వ్యవస్థకు మనస్తత్వ వైద్య శాస్త్రజ్ఞులు అత్యంత ప్రాధాన్యాన్నిస్తున్నారనీ, సాంసారిక జీవిత రక్షణ మానసికారోగ్యంలో ముఖ్యాంశమనీ డాక్టరు లెమ్కావు ఇటీవల రేడియో ఉపన్యాసం ఒక దానిలో తెలియజేశారు. భార్యభర్తల మధ్య అన్యోన్యాన్ని తిరిగి చేకూర్చ ప్రయత్నించడం వారి కోపతాపాలను 'చల్లార్చడానికి' కొంతకాలాన్ని వినియోగించడం కుటుంబ విభాగం మామూలుగా జరిపే విచారణ పద్ధతి కాబట్టి తిరిగి అన్యోన్యంగా వుండే భార్యా భర్తల సంఖ్య ఎక్కువకావాలని ఆయన అన్నారు. విడాకులిచ్చుకునేవారి సంఖ్య అలా తగ్గడంవల్ల కుటుంబ రక్షణ జరుగుతుందనీ, మానసికారోగ్యం ఏర్పడుతుందనీ, మానసికారోగ్యం ఇంకా బాగుపడుందనీ ఆయన తెలియజేశారు.

ఈ కుటుంబ విభాగంలో న్యూయార్క్ సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తులు వంతుల వారీగా పని చేస్తారు. నెలనెలకు వీరి నియామకం జరుగుతూ వుంటుంది. ఈ నూతన కుటుంబ న్యాయస్థానంలో న్యాయమూర్తిగా ప్రారంభంలో పనిచేయవలసిందని జస్టిస్ డేవిడ్ డబ్ల్యు పెక్ నియిమించారు. ఇటువంటి న్యాయస్థానంలో న్యాయమూర్తిగా పని చేయడానికి అసాధారణమైన ఓరిమి, అవగాహన శక్తి కావలసివుంది. తగాదాపడి వచ్చిన భార్యాభర్తలను కోర్టులో విచారించడానికి పూర్వం వారితో సమావేశాలు జరిపే సందర్భంలో ఆయన ఇటువంటి ఓరిమిని అవగాహన శక్తిని ప్రదర్శించి తన పనిని విజయవంతంగా నిర్వహించగలగడం ఈ పదవికి ఆయన నియామకం జరగడానికి కొంతవరకు కారణం.

కుటుంబ సంబంధాలను గురించిన కేసుల విషయంలో ఈ కుటుంబ న్యాయస్థానం నిర్వహించవలసి వున్న పాత్రను గురించి తానేమి ఆశిస్తున్నదీ జస్టిస్ గోల్డ్ ఇలా తెలియజేశారు. "కోర్టులో కేసులు పెట్టుకొనబోయే భార్యా భర్తలు అలా కేసు పెట్టుకొనడానికి పూర్వం కోర్టువారి అనుమతిని కోరవలసి వుండేటట్లు చేయడం మా ఉద్దేశం. అప్పుడు కేసుకు సంబంధించిన ఉభయ పక్షాల వారితోను కోర్టువారు సంప్రతించి వారి మధ్య అన్యోన్యాన్ని తిరిగి చేకూర్చడానికి ప్రయత్నిస్తారు." ఆ విధంగా అయితే చివరికి కోర్టుద్వారా విచారణ జరగవలసి వున్నప్పటికి వారి కోపతాపాలు "చల్లబడేటందుకు" కొంత కాలవ్యవధి వుంటుంది.

"క్షణికమైన కోపతాపాల తరువాత వారు తరుచు తమ మనుసులు మార్చుకుంటూ వుంటారు. ఇది మా అనుభవం" అన్నారు జస్టిస్ గోల్డ్.

# శ్రీ రామ కర్ణామృతము



(ఆంధ్రానువాదము)

శ్రీ కల్లూరు అహోబలరావు

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

౫

జనకపుత్రీనాథ ! జగదీశ్వరుఁడవీవు ! – జనులకానందంబు నల్పుదీవు !
సకల జంతువులకు జననమూలంబీవు ! – జనులబాధ హరించు సౌమ్యుఁడీవు !
జనన మాది, మునుల సఖుఁడై–కొలసితీవు ! – శాశ్వతుండవు నీవు–సరసుఁడీవు !
భార్గవ గర్వంబుఁ బరిహరించితి వీవు ! – జంఘాలుఁడైన జాజ్వల్యుఁడీవు !
కరుణఁగల్గిన శ్రీరామ ! కావుమయ్య ! – రక్తి ధ్యానింతు, లోకేశ్వరా ! ప్రణామ
మర్పణముసేతు, భజియింతు నాశ్రయింతు ; – రక్షసేయుము, శ్రీ రఘురామచంద్ర !

౬

రఘువంశరాజుల రత్నంబు, రాజీవ – నేత్రుండు, బలపూర్ణగాత్రుఁడఖిల
జనకంటకులగు, నిశాచర ధ్వంసంబుఁ – గావించినట్టి విఖ్యాత పురుషుఁ
డాదిమదేవుండు, హస్తంబులందుఁ గిం-కిణీ, కంకణముల నరికించుకొన్న
రాఘవేశ్వరుఁడు, శ్రీ రాకేందు బింబాన - నుండు రఘుకులోత్తముండు, ధరణి
జాత సీత కింపు సల్పెడు, రఘునాయ-కుండు, మమ్ము సతము నిండుప్రేమఁ
గాంచి రక్షసేయఁగాఁ బ్రార్థనముసేయు-చుందు మధికభక్తిఁ బొందుపఱచి.

౭

రాఘవేంద్ర ! దయాకర ! రామచంద్ర ! - భద్రయశ ! రఘువంశ, సముద్రచంద్ర !
కువలయేశ ! సీతామనః కుముదచంద్ర ! - నిర్మలాత్ముఁడౌ, సుగ్రీవు నేత్రములను
కలువలకుఁ బూర్ణచంద్ర ! విఖ్యాతపురుష ! - చేతు జేజేలు నీకు ! రాజేంద్రచంద్ర !

౮

కోదండధారివై, వేదండములఁబోలు – ఘోరారి ప్రకరముల్ గూల్చినావు !
వారిధి గంభీర ! వర్షాంబుద శరీర ! - స్థిరుఁడవై, జగముల చెలఁగినావు !
గుణనిధివై, భక్తగణములనెల్లను - కరుణతో, రక్షించి ప్రోచినావు !
శ్రీరామ ! రఘువర ! సీతాపతీ ! పద్మ-నేత్ర ! విజయుఁడవై, నెగడినావు !

సుప్రకాశుండవై, నీవు సుందరాంగ! - జగములకు వెల్గునొసగెదు సార్వభౌమ!
మాదు చింతలమాన్పి, సమ్మోదమిమ్ము; - రమ్యగుణధామ! శ్రీరామ! సౌమ్యనామ!

౯

లక్ష్మణునిఁగూడిసట్టి, శ్రీరామచంద్ర! - ఉత్పల శ్యామల శరీర! యుజ్జ్వలాంగ!
జానకీపతీ! నీనామస్మరణమెపుడు - నెడతెగక, నాదుజిహ్వ చేసెడి, ధరిత్రి.

౧౦

వామభాగంబునఁ లక్ష్మి వఱలుచుండ - నాపదలఁదోలి, శత్రుజయంబుఁగొనుచు
వారిచే, నమస్సులఁగొనువారిజాక్ష! - రమ్యగుణధామ! శ్రీరామ! రక్తిసతము
నా మనసు, నిన్నె స్మరియించు నేమముగను.

(సశేషము)

# ఇల్లాలు

"మధుశ్రీ"

కోడి కుయ్యడం తడవు ... ఎలా మెలకువ వస్తుందో ఇల్లాలికి !

ఆమె తీసుకొనే విశ్రాంతి రాత్రి పదిగంటలనుండి తెల్లవారుఝాము మూడున్నరవరకూ ... ! ఎంత ఓపిక ... ఎంత ఓరిమి ! చెప్పడానికి వీల్లేదు.

ఎంతెంత దేశనాయకులైనా ... ఎంతెంత కళాకారులైనా ఎంతెంత శాస్త్రవేత్తలైనా అమృతప్రాయమైన నీ చేతి గోరుముద్దలు ఆరగించినవారే...!

ఎన్నో రత్నాల నందించేవు ! మాతృప్రేమని అన్నంలో ... మాటల్లో రంగరించి పెడతావు ... నీ కందులోనేవుందా హాయి ... నీకు బ్రహ్మ రాసిపడేశాడు. తెల్లారి లేచింది మొదలు మళ్ళీ పడుక్కునేవరకూ వంటింట్లో కొట్టుకుంటూవుండమని.. !

శీతాకాలం చలి ఎముకల్ని కొరుక్కుతింటూ వుంటుంది ... ప్రత్యూషవాయువుల్లో చలి మరీ ఎక్కువ ... అయినప్పటికీ నువ్వు బద్ధకించవు ... అంత పెందలకడనే లేవడం ఎందుకు ? లేకపోతే ఎవరుచేస్తారు ... ?

చంటిపిల్లలు తెల్లవారుఝామునే లేస్తారు ... వాళ్ళని పొత్తుల్లోకితీసుకొని ... బుజ్జగించి ... మళ్ళీ పడుకోపెడతావు ... జోలపాటపాడి నిద్రపుచ్చుతావు ... ఇంతట్లోకే చిట్టి తమ్ముడు లేస్తాడు ... శ్రీవారు కదలకుండా ముసుగుతన్నుకొని పడుకుంటారు ... లేచి తిన్నగా వంటింట్లోకే వెడతావు ... ఒక్కర్తివే ... చలి ... చీకటి ... అది మొదలుకొని పనులన్నీ దేవుకొనివస్తావు ... చంటిపిల్లలున్న కొంపలు ... వస్తువులేవీ స్థిరంగావుంచరు ... అన్నీ సముదాయించుకువస్తావు ... పొయ్యిలు బాగుచేసుకోవడం ... క్రితం రోజునుంచీవున్న గిన్నెలు శుభ్రపరుస్తావు ...

హోరున వాన ... ! చల్లగా గాలి ... ! ఇల్లాలు ! దానికీ లక్ష్యపెట్టవు ! "శీతల వాయువులు ఒంటికిపడవు...రొంప దగ్గుపడతాయి ... ఇప్పుడు చెయ్యకపోతేయేం" అని ప్రశ్నిస్తే "ఆఁ ... ఇవ్వేళ కొత్తా ఏమన్నానా ! ... ఎన్నాళ్ళనుంచో అలవాటయిపోయింది ..." అంటావు ... మహాసాధ్వి ఇల్లాలు ... !

పొయ్యిలో నిప్పు రాజేస్తావు ... వెధవకట్టెలు ఎప్పటికీ మండవు ... కళ్లు చిల్లులుపడేలా పొగ ...! వానాకాలం అసలు మండవు ... అయినా నువ్వు విసుక్కోవు ... ! కాఫీ పెడతావు ... ఇంతట్లోకే కొంప మునిగిపోయినట్లు చంటి పాపాయి వుయ్యాల్లో వుండి సావేరిరాగం సప్తమ స్వరంలో అందుకుంటాడు ... !

"నిద్రపోకుండా ఏంచంపుతున్నావురా" అంటూ బద్ధకంగా ఒళ్లు విరుచుకొని మరో వైపుకి తిరుగుతారు శ్రీవారు ... కుఱ్ఱాణ్ణి పలుకరించడు ...

పొయ్యిమీద పాలు అలాగే అట్టిపెట్టి పిల్లాణ్ణి సముదాయిస్తావు ... కడుపుతీపి ... ! నెమ్మదిగా తూర్పుదిశ ఎఱ్ఱపడుతుంది ... ఎఱ్ఱపడ్డమేమిటి ? బారెడు ప్రొద్దే ఎక్కుతుంది ! ఇంకా శ్రీవారు లేవరు ... కాఫీ అయింది లేవమంటావు ... అప్పుడే ఎనిమిది గంటలవుతుంది ... చంటి కుఱ్ఱాడికి ఆముదం పెడతావు ... నీళ్లు పోస్తావు ... కాటుకాబొట్టూ పెట్టి...పాలిచ్చి నిద్రబుచ్చుతావు .... పాపాయి బుగ్గలమీద తనివితీరా ముద్దులు గుమ్మరిస్తావు ... !

మాతృత్వంలోని అనిర్వచనీయానందాన్ననుభవిస్తావు ... శ్రీవారికి నీళ్లు తోడియిస్తావు ... ఇవన్నీ నీ ఒక్క రెక్కమీదే జరగాలి ... !

కుఱ్ఱాళ్ళకి నీళ్లుపోసి ... తలదువ్వి ... బట్టలు కట్టి బళ్ళోకి సాగనంపుతావు ... ఇవన్నీ చూసు

కుంటూవుంటే పెద్దబ్బాయి కాలేజీకి టైమవుతోందని కంగారుపెడతాడు ... ఇంజనులా పని చేస్తావు ... అన్నం వుడకబెట్టి పెద్దబ్బాయిని సాగనంపుతావు ... శ్రీవారికి ఆఫీసుకి టైమవుతుంది ... మడి కట్టుకూర్చుంటాడు ... అయినప్పటికీ విసుక్కోవు...! చూపుల్లో ప్రేమను మిళితంచేస్తావు...!

ఆ కూర కలుపుకోమని ఈ పచ్చడి తినమని ... చిరునవ్వుతో "ఎంకరేజి" చేస్తావు ... ! ఆయనగారు తీక్షణంగా చూస్తే వొణికిపోతావు ... ! శ్రీవారికి బట్టలుతీసిచ్చి ... జోళ్లుదులిపి ... తమలపాకులకి సున్నంరాసిచ్చి ... ఆఫీసుకు సాగనంపుతావు ... ! అప్పటికి ఊపిరి పీలుస్తావు ... !

భోజనానికి కూర్చోబోతే ... చంటి కుర్రాడు లేస్తాడు. వాణ్ణి చంకనెట్టుకొని భోజనం అయిందనిపిస్తావు ... ! ఒంటిగంటవుతుంది నువ్వివతలపడబోయేసరికి ... ! కుర్రాళ్లు స్కూళ్లనుంచి చక్కావస్తారు...! వాళ్లకి అన్నంపెట్టి మళ్లీ మధ్యాహ్నం కాఫీకి నీళ్లెట్టుతావు ... ! రెండయిపోతుంది...

సాయంకాలం వంటకి సరంజంచేస్తావు ... ఆయనకి బాగా ఏది ఇష్టమో అవే చేసిపెడతావు ... ! నీకు స్వార్థంలేదు ... ! సాయంకాలం అవబోయేసరికి శ్రీవారు బండెడు ఫైళ్లతో ప్రత్యక్షమవుతారు ... ఎదురుగుండా వెళ్ళి ఆయన్నిచూసి జాలి పడతావు...! నిన్నుచూసి ఎవ్వరూ జాలిపడరు...! ఆమె కసలు విశ్రాంతిలేదు. నీకసలు సెలవుల్లేవు ... ఆదివారం! ... పబ్లిక్ హాలీడేస్‌లోకూడా...వాన కురిసినసరే ... తుఫాను పట్టినాసరే...! ప్రపంచం తలక్రిందులయినాసరే ... ! నీకొక్క నిముషం గాలి పీల్చుకుందుకు విశ్రాంతిలేదు ... ! రాత్రి భోజనాలుపెట్టి ... పక్కలువేసి ... కుర్రాళ్లని నిద్రపుచ్చి భోజనానికి కూర్చుంటావు ... ! వంటిల్లు సర్దుకొని తాళాలు పెట్టుకునివతలపడేసరికి పది గంటలు ... !

శ్రీవారు మూడోకాలంలో వుంటారు...పాపం అలసిపోయేరనుకుంటావు ... ! రేపు చేసుకోవలసిన పనులు మననం చేసుకుంటావు ! నిద్రపోతావు ... నీ నిత్య జీవితంలోని కార్యక్రమం ఇదే...ఇల్లాలు... నీకెప్పుడు కాళీవుండదు ...

"ఇల్లాలి చలువయె
ఇల్లులకు వెలుగు ... "

# ఇజబెల్లా

మూలం :
జాన్ కీట్స్

అనుసరణ :
'అర్జున్'

పూర్వం ఫ్లారేంస్ పట్టణంలో ఇద్ద రన్నదమ్ములుండే వారు. వారిద్దరు వ్యాపారంచేసి లక్షలు ఆర్జించారు. వారిద్ద రికి ఒక్కగాను ఒక్క చెల్లెలు వుండేది. ఆమే ఇజబెల్లా. ఆమె రూపసి. గుణా లలో గణన కెక్కింది. అన్నదమ్ము లిద్దరూ చెల్లెలికి యుక్తవయస్సురాగానే సిరిసంపదలు గలిగిన ఉన్నత వంశంలో వాడిని తెచ్చి వివాహం చెయ్యాలని నిశ్చ యించుకొన్నారు.

కాని, వారింట్లోనే సేవకుడుగా పని చేసే లోరంజో అనే యువకుడిని - ఇజ బెల్లా ప్రేమించింది. అతను ప్రతిదినం తటస్థపడుతుండడం, ఒకేచోట నివసిస్తూం డడం వారి ప్రణయానికి దోహదం చేసాయి. అతనూ ఇజబెల్లాను ప్రేమిం చాడు. వారిద్దరు ఒక్క క్షణంగూడా వదలివుండలేకపొయ్యేవారు. భోజన సమ యాలలోగూడా ఒకే పంక్తిని, ప్రక్క ప్రక్కగా కూర్చుని విలాసంగా భుజించే వారు.

అలాగా వారిద్దరిప్రేమ దినదినం క్రమేపి వృద్ధిచెందింది. ఇజబెల్లా అతన్ని అనుక్షణము విడనాడక అతనితోపాటే తిరుగుతుండేది. ఆమెకు అతను పలికే ప్రతి పలుకూ మధురంగా కర్ణానందంగా వుండేది. అతని పలుకులే ప్రతిసారి తన చెవులకు ప్రతిధ్వనించేవి. ఆమె పాడే ప్రతి గీతికలోనూ ఆమె లోరంజో నామాన్నే వుచ్చరించేది. నడతలో ప్రవర్తనలో ఆమె పూర్తిగా అతన్ని కోరింది. లోరంజో తన గది తలుపు చప్పుడుచేస్తే అది ఇజబెల్లాచేసే శబ్దమేనని తెలుసు. కాని అతను ఆమెను ప్రేమించినా-తన ప్రేమను తనలోని బలహీనతచేత వెల్లడించలేక పొయ్యాడు. అందుకే ఇజబెల్లా తల్లడిల్లి పోయింది. లోరంజోకూడా తన బలహీన తకు చాలా విచారించి, ఒక దినం ప్రయ త్నించి వుద్రేకంతో తన ప్రేమ వెల్లడించ డానికి ప్రయత్నించాడు. ఇజబెల్లా అతని వుద్రేకాన్ని గుర్తించి, అతను తన్ను ప్రేమించినట్లు గ్రహించింది, మృదువుగా అతని పేరెట్టి ''లోరంజో'' అని పిలిచింది. అతను ఆనందంతో ఆమె చేతిని పరిగ్ర హించాడు. ప్రతిదినం యిద్దరూ రహ స్యంగా ఉద్యానవనంలో సమావేశమై తియ్యని కలలు కంటుండేవారు. రాత్రు లందు ఇజబెల్లా భవన ఉపరిభాగంలో, చల్లని వెన్నెలలో విహరిస్తూ ప్రణయ గీతికలు పాడే అందుకు ప్రత్యా

న్యాయంగా అతనుకూడా పాటలుపాడి సంతోషించేవాడు.

కాని, వారి ఆదర్శప్రేమ - శాశ్వత రూపంలో, అన్యోన్యంగా వుండడానికి వీలు లేకుండా చేసాయి పరిస్థితులు. కొన్నిదినాలు మట్టుకు వారి ప్రణయానికి ఒడిదుడుకులు లేకుండా సాగింది. కాని ఇజబెల్లా చూపులు, లోరంజో ప్రవర్తన ఆమె అన్నలిద్దరికి అనుమానం కలిగించినవి. ఒకదినం రహస్యంగా ఇజబెల్లాను అనుసరించివెళ్ళి నిజం గ్రహించారు. వారు తమ చెల్లెల్ని తమ హోదాకు తగిన ధనవంతునికియిచ్చి పెండ్లి చేయాలనుకొన్నారు. కాని తమ సేవకుడగు లోరంజో ఇజబెల్లా ప్రేమకు పాత్రుడైయ్యాడని తెలుసుకొన్న వారి హృదయాలు భగ్గున మండిపొయ్యాయి. కాఠిన్యత వారి హృదయాలలో ఆవరించింది. అప్పటికి, వచ్చిన ఉద్రేకాన్ని అణుచుకొని - రహస్యంగా సంభాషించుకొన్నారు - అన్నదమ్ములు.

మరుసటిదినం లోరంజోతో తాము అడవివేటకు పోతున్నామని చెప్పి, తమతో పాటు అతన్ని రమ్మనమనిచెప్పి తీసుకొని వెళ్ళారు. యజమానుల కుట్రను గ్రహించని లోరంజో ఉల్లాసంగా, ఇజబెల్లాకు సంజ్ఞపూర్వకంగా తను వెడుతూన్నట్లు తెలియజేసి, వారితోపాటు గుర్రంపై వెళ్లాడు. మధ్య అడవిలోనికి వెళ్లిన తరువాత, అన్నలు యిద్దరుకలిసి, అతన్ని హత్యచేసి అచ్చటే వున్నపాటున గొయ్యి త్రవ్వి పాతిపెట్టి ఇంటికి చేరుకొన్నారు. లోరంజో తమతో తిరిగిరాకపోవడానికి, కల్లిబొల్లి కథ కల్పించిచెప్పారు. అత్యవసర వ్యాపార పనిపై విదేశానికి పంపామని చెప్పారు. అంతకన్నా ఒత్తిడిచేసి అడగడానికి ఇజబెల్లా జంకింది. కొన్ని దినాలవరకు నిజమనుకొన్న తరువాత లోరంజో, లేకుండా పోవడం ఆమె హృదయం తపించిపోయింది. క్రమేపి, ఆమె అందచందాలు క్షీణించసాగాయి.

ఒకదినం రాత్రి లోరంజో ఆత్మ భూత రూపంలో ఇజబెల్లాకు కనిపించి, ఆమెవద్ద నిలిచిపోయింది. ఆ భూతం పూర్వరూపంలో కొంత పోలికలున్నా - గుర్తుపట్టలేకుండావుంది. లోరంజో తన హత్యాకాండను విపులంగా వివరించి గుర్తులతో పాటుచెప్పి - అదృశ్యమైపొయ్యాడు.

ఇజబెల్లా తక్షణమే తన దాదిని తీసుకొని అడవికి వెళ్లింది. భూతం రూపంలో లోరంజో తెలియపరిచిన గుర్తులనుబట్టి ఆ స్థల నిర్ణయంచేసి అక్కడి మట్టి త్రవ్వుటకు ఆరంభించింది. తోడుగా వచ్చిన దాదికి ఆశ్చర్యంవేసి, ఆమెకూడాకలసి త్రవ్వడానికి పూనుకొంది. మొదట తను లోరంజో వ్రేలికి పెట్టిన ఉంగరం కనిపించింది. లోతుగా త్రవ్వేసరికి, శిథిలావస్థలో

వున్న లోరంజో శవం కనిపించింది. ఇజబెల్లా విషాదానికి అంతులేకపోయింది. లోరంజో దేహాన్నుంచి, తల వేరుచేసి, రహస్యంగా యింటికి తెచ్చింది. తన అశ్రుజలాలతో ఆ శిరస్సును ప్రక్షాళనంచేసింది. సుగంధ ద్రవ్యాలతో పూజించి, ఒక పాత్రలోవుంచి భూస్థాపితంచేసి దానిపై రోజా మొక్కను నాటింది. ప్రతి రోజు ఆ చెట్టుచెంతే విలపిస్తూ వుండిపోయేది. దాన్ని తన కన్నీటితో నింపేది ఆ దుఃఖములో ప్రపంచాన్నే మరిచిపోయింది. రోజా మొక్క - పరిసర ప్రాంతాల వాటి కన్నా పెరిగి చిగిర్చి పుష్పించింది, కమ్మని వాసనలు వెదజల్లింది. లోరంజో ఆత్మ సంతృప్తి చెందిందా అన్నట్లు ఆ మొక్క బలిసిపోయింది. లోరంజో అంతర్ధాన్నం అయినప్పటినుండి భగ్నహృదయురాలైన ఇజబెల్లా ప్రవర్తన పరిపూర్ణంగా మారిపోయింది. అన్నలిద్దరికి, పూర్తిగా వెర్రెత్తిపోయింది. ఇజబెల్లా రోజా మొక్క వద్ద కూర్చుని ఈ లోకాన్నే మరిచిపోవడానికి కారణం అనూహ్యంగా వుండిపోయింది. ఆమె అలా చేయడానికి, ఏదో వుందని, ఒక దినం ఇజబెల్లా చర్చికి వెళ్లినపుడు రోజా మొక్కను పూడబెరికి, త్రవ్వి చూచేసరికి, లోరంజో పుర్రె కనిపించింది. అన్నలిద్దరు తెల్లబోయి-తమ రహస్యం వెల్లడైపోయిందని - ఎవ్వరికీ చెప్పక ప్లారెంసు విడిచిపెట్టి, పరదేశానికి పారిపొయ్యేరు. ఇంటికి తిరిగివచ్చి, రోజా మొక్క, పుర్రె పాతిన చోటున పాత్ర కనుపించక ఇజబెల్లాకు మతిచెడి - కనుపించినవాళ్ళనల్లా పాత్రనే అడిగి హృదయం బ్రద్దలై - అదే ధ్యానంలోనే వుండి - విగత జీవురాలైంది.



శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్ (విజయవాడ) వారి రజతోత్సవ సందర్భమున
పాల్గొనిన బంధుమిత్ర పరివారము, మాన్యుఫాక్చరర్సు, రెప్రజెంటేటివులు

శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు రజతోత్సవ సందర్భమున

# శ్రీ శ్రీరాం భీమశంకరరావుగారి స్వాగతోపన్యాసము



మహాజనులారా !

ఆంధ్ర దేశంబునకు కూడలియు, వర్తక పారిశ్రామిక సంస్థల నిర్వాహకులకు నిలయమైనట్టియు పవిత్ర కృష్ణా నదీతీరమైన శ్రీకనకదుర్గాక్షేత్రమగు మన విజయవాడ పట్టణమున 25 సంవత్సరముల నాడు పెద్దలయొక్క ఆశీస్సులతో ప్రారంభించిన శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు రజతోత్సవము జరుపుకొను సందర్భమున మిమ్మెల్లరిని ఆహ్వానించి సత్కరించు భాగ్యము కలిగినందుకు ఆనందించుచున్నాను.

భారత వాణిజ్య ప్రముఖులలో నొకరును విద్యాసంస్థల నిర్వాహకులు శ్రీ చుండూరు వెంకటరెడ్డి శ్రేష్టి. బి. ఏ. గారిని యీ మహాసభకు అధ్యక్షులుగా నేనుకోరినంతనే దయతో ఆమోదించినందులకు మా సంస్థ నిర్వాహకుల తరపున నా అభివందనములు తెలుపుచున్నాను.

మరియు యీనాటి కార్యక్రమములో ప్రధానమైన పూజ్యులు, పారిశ్రామిక వేత్తలు, ఆంధ్ర ప్రముఖులు, విద్యాపోషకులు, శ్రీ కేసరిగారి ఛాయాచిత్రపటము ఆవిష్కరించుటకు దయతో ఆమోదించిన మా మిత్రులును, మాబి పురపాలకసంఘ అధ్యక్షులగు డాక్టరు టి. వి. ఎస్. చలపతిరావుగారికి నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాను.



మధుర – బెంగుళూరు బ్రాంచిల భాగస్వామి
శ్రీ కే. యుల్. కాంతంగారు అభినందించినప్పటి దృశ్యము

## సంస్థయొక్క చరిత్ర

ఈ పవిత్ర సమయమున ఈ స్టోర్సు యొక్క చరిత్రను క్లుప్తముగా నివేదించుకొనుచున్నాను. ఈ సంస్థ 1929 సంవత్సరమున ప్రారంభించబడినది. తదాదిగా దినదినాభివృద్ధిచెందుచూ ఆంధ్రసోదరుల ఆదరణతో స్థానిక వర్తక సంస్థలలో నొకటిగా అభివృద్ధికి వచ్చినది. 1933 సంవత్సరములో మద్రాసు పట్టణమునకు చెందిన కేసరి కుటీరంవారు (పూజ్యులు శ్రీ కేసరిగారు) శ్రీవారిచే తయారుచేయించబడే లోధ్ర తదితర వారిమందులకు ప్రథమమున నాలుగు జిల్లాలకు మాత్రమే ఏజన్సీ యిచ్చియుండిరి. అనంతరం వర్తకమునందు మాకుగల బాధ్యతలను పూజ్యులు కేసరిగారు గుర్తించి ఆంధ్రా నిజాంరాష్ట్రములు, తమిళనాడు మైసూరుస్టేటు, ఒరిస్సా, బొంబాయి రాష్ట్రములకున్నూ ఏజన్సీల నొసగిరి. మరియు నూతన వ్యాపార సంస్థలు స్థాపించుటకు సికింద్రాబాదు, బరంపురం, మధుర, బెంగుళూరు, బొంబాయిపట్టణములలో మా సంస్థను బ్రాంచి సంస్థలుగా నెలకొల్పబడి నిర్వహించు భాగ్యము కలిగినది. 1944 సంవత్సరమున డిస్ట్రిబ్యూషన్ విధానమువల్ల వ్యాపారము అభివృద్ధి అయినందున ఏజన్సీను శాఖను మరొక సంస్థగా ప్రారంభించినాము. అనేక సంవత్సరములుగా మా సంస్థలో గుమాస్తాలుగా నిర్వహించువారిని భాగస్వాములుగా శ్రీ శీతారాం జనరల్ స్టోర్సునందు మధుర, బెంగుళూరు, సికింద్రాబాదు, బరంపురం బ్రాంచీలలో భాగస్వాములుగా నిర్ణయించుకొని నిర్వహించుచున్నట్లు తెలుపుటకు సంతోషించుచున్నాను.



శ్రీ భీమశంకరరావు, సీతాపతిరావుగార్లు, సువర్ణ మాలలతో నలంకరించిన 'సింకో' భాగస్వామి శ్రీ రామలింగపిళ్ళెగారు



ఉపన్యసిస్తున్న శ్రీ భీమశంకరరావుగారు

యీ సంస్థను స్థాపించి నిర్వహించుచూ ఇంకను మరికొన్ని సంస్థలను ప్రారంభించినాము. (1) కేసరి మెడికల్ స్టోర్సు, విజయవాడ. (4) శ్రీనివాస టింబరు డిపో. మద్రాసు. (3) సత్యనారాయణ ఫార్మసీ, విజయవాడ సంస్థలను నిర్వహించుచున్నాము. మరికొన్ని ప్రత్యేక ఏజన్సీలున్నూ తీసుకొను అవకాశములు లభించినవి. 1. ది సౌత్ ఇండియా మాన్యుఫ్యాక్చరింగు కంపెని, మధుర. మరియు మరికొన్ని ఇంగ్లీషు మందుల కంపెనీలకున్నూ, కడపజిల్లా ప్రొద్దుటూరులో ప్రారంభించిన ఐకోల్లు లోషన్ డిపోవారి మందులకున్నూ క్షీరవర్ధని లేబరటరీస్, విజయవాడ వారి ఔషధములకున్నూ, మోడల్ సోప్ కంపెని కలకత్తా వారి సబ్బులకున్నూ, ఈస్టరన్ మెడికల్ వర్క్సు వారి (కాకినాడ) తైలములకున్నూ ఇంకను మరికొన్ని కంపెనీలకు పలు రాష్ట్రములకు సోల్ డిస్ట్రిబ్యూటర్సుగా పని చేయుచున్నాము. యీ సంస్థను ప్రారంభించి పలు ప్రాంతముల పారిశ్రామికసంస్థల నిర్వాహకులనుండి ఏజన్సీలు సేకరించి వారి ఆదరణాది సహకారముతో యీ సంస్థను నిర్వహించు శక్తినిచ్చిన పారిశ్రామిక వేత్తలను హృదయపూర్వకముగా అభినందించుచున్నాను.

ప్రథమముగా ఏజన్సీ ఒసంగిన పూజ్యులు కేసరి గారికి హృదయపూర్వక భక్త్యంజలి. ఈ పవిత్ర సమయమున శ్రీ సీతారామ జనరల్ స్టోర్సులో పని చేయు అన్ని వర్గములవారిని ఇంతవరకు సహకరించి సంస్థ అభివృద్ధికై కృషియొనర్చిన భాగస్వాములను గుమస్తాలను ఇతర పనివారలను, అభినందించుచూ వారి కృషికి నేను వందనము అర్పించుచున్నాను.

# శ్రీ సీతారామ జనరల్‌స్టోర్సు ఏజన్సీస్ (విజయవాడ)
# రజతోత్సవము



శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్ వారు విజయవాడలో తే 26-2-56 న వైభవోపేతంగా రజతోత్సవమును జరుపుకొనిరి.

ఉత్సవ కార్యక్రమము ఉదయము ఏజన్సీ స్టోర్సులలో సహస్రనామపూజ, శ్రీ కనకదుర్గ ఆలయమునందు పూజార్చనలతో ప్రారంభమయి హిందూ హైస్కూలు ఆవరణలో మధ్యాహ్నము అతిథి, బంధు, మిత్రులతో విందు భోజనము, సాయంకాలము తేనీటివిందు, అనంతరము శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారి అధ్యక్షతన ఉత్సవ సమావేశము జరిగెను.

యజమానులు శ్రీ శ్రీరాం భీమశంకరరావుగారు స్వాగతము చెప్పుచూ సంస్థ అభివృద్ధిని, చరిత్రను వివరించి తమ ఆహ్వానమును స్వీకరించి యీ యుత్సవములో పాల్గొనవచ్చినవారికి ధన్యవాదము అర్పించిరి.

అధ్యక్షులు శ్రీ చుండూరు వెంకట రెడ్డిగారు సంస్థ యజమానులు శ్రీ శ్రీ రాం భీమశంకరరావు, సీతాపతిరావుగార్ల గుణ విశేషాలను, కార్య దక్షతను వివరిస్తూ, సంస్థ పురోభివృద్ధిని అభినందించిరి.

ఐకోల్డులోషన్ డిపోవారు, భారతీయ వైశ్య సంపాదకవర్గమువారు, బ్రహ్మాంపిన్సు కంపెనీ (భీమవరం) వారు, సీతారాం జనరల్ స్టోర్సు ఏజన్సీస్ పరివార బృందము అభినందన, సన్మాన పత్రములు సమర్పించిరి.

మద్రాసు కేసరి కుటీరం లిమిటెడు వారు సీతారాముల విగ్రహములుగల రజత షీల్డు, ఐకోల్డులోషన్ వారు రజతవీసా, సింకోవారు సువర్ణమాలలు, మధుర, బెంగుళూరు బ్రాంచీల తరఫున శ్రీ కే. యల్. కాంతం రజతకప్పు, శ్రీ ఏ. వి. శర్మ సికింద్రాబాద్, శ్రీ యన్. ఉదయ శంకరరావు (S. G. S. విజయవాడ) రజత ఓడలు, శ్రీ టి. నారాయణమూర్తి బొంబాయి రజతకూజా, దుర్గా కెమికల్ ఇండస్ట్రీస్ విజయవాడ రజతకప్పు, హంపి బ్యూటీ ప్రొడక్షన్సు తణుకు పూవుల బుట్ట, సింకో ఆంధ్ర, సికింద్రాబాద్ రిప్రజెంటేటివులు వెండిఫొటో, గ్లాసులు, శ్రీ గుడివాడ హనుమంతరావు తెనాలి రజత గ్లాసులసెట్టు, కృష్ణా మెడికల్ స్టోర్సు రాజమండ్రి వెండి రామ పట్టాభిషేకం ఫొటో అభినందించుచు బహూకరించిరి.

అనంతరము డా॥ టి. వి. యస్. చలపతిరావుగారు కీ॥ శే॥ కే. యన్. కేసరి

గారి చిత్రపటము నవిష్కరించుచు వారి జీవిత, అనుభవ విశేషాలు ఆదర్శప్రాయమైనవని ఉద్బోధించుచు జాతీయత తీర్చిదిద్దబడుతున్న యీ రోజులలో డాక్టరు కేసరిగారిలాంటి మహామహుల జీవిత చరిత్రలు విద్యార్థులకు పాఠ్య భాగాలు కాతగినవని చెప్పారు.

ఈ సందర్భమున భారతీయ వైశ్య సంపాదకులు శ్రీ అన్నవరపు సుబ్బారావు గుప్త, డి. వి. కృష్ణయ్య, చింతా సుబ్బారావు మొదలగుప్రముఖులు ఉపన్యసించిరి.

ఈ సంస్థ యజమానులు తమ ఉద్యోగ బృందమునకు నెలజీతము బోనసుగా ప్రకటించుచూ S. K. P. V. V. H. హైస్కూలుకు (విజయవాడ) రు. 251/, అన్నదాన సమాజమునకు రు. 251/, వెలిదెండ్ల హనుమంతరాయ గ్రంథాలయమునకు రు. 251/, పబ్లిక్ హాస్పిటలుకు రు. 251/, శ్రీ భ్రమరాంబమల్లేశ్వర గ్రంథాలయమునకు రు. 251/, భారతీయ వైశ్య పత్రికకు రు.51/, శ్రీ గురూజీ రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘమునకు రు. 51/ లు విరాళములనిచ్చిరి.

రాత్రి 11 గంటలవరకు శ్రీ యన్. కే. మనోహర్, విజయలక్ష్మి బృందమువారి భరతనాట్యము జరిగెను.

ఉత్సవములో శ్రీ యం. కే. చౌదరి, డి.వి. కృష్ణయ్య, కేనరా ఇండస్ట్రియల్ బ్యాంకింగ్ సిండికేటు ఏజంటు, శ్రీ మల్లెల శ్రీరామమూర్తి (విజయవాణి సంపాదకులు) ప్రజాసేవ సంపాదకులు, శ్రీ పచ్చిపులుసు సుబ్బారావు మొదలగు పురప్రముఖులు పాల్గొనిరి. శ్రీ యస్. లాల్ చంద్ దాదా, డా॥ టి. యన్. ఘోష్ (బెంగాలు కెమికల్ పబ్లిసిటీ ఆఫీసరు) యస్ జి. యస్. బెంగుళూరు, మధుర బ్రాంచీలవారు, ఆయుర్వేదాశ్రమం లిమిటెడువారు, శ్రీ సి. సి. పున్నయ్య. (గృహలక్ష్మి సంపాదకులు) శ్రీ యస్. టి. ఆర్. అయ్యంగారు (మద్రాసు) శ్రీ కే. కే. మీనన్, (తిరుచందూరు), శ్రీ సి. హరిహరన్ (మధురై), ఎన్. దేశాయి గౌండర్ & కంపెని, (కోయంబత్తూరు) రత్నం పెన్సు (రాజమండ్రి) గారల సందేశములు చదువబడెను.

ఉత్సవ కార్యక్రమమును ముగించుచూ శ్రీ భీమశంకరరావుగారు అధ్యక్షత వహించిన శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారికి డా॥ కేసరిగారి చిత్రపటము నవిష్కరించిన డా॥ టి. వి. యస్. చలపతిరావుగారికి, యింకా యితర ఉపన్యాసకులకు, ఉత్సవ సమావేశము జరుపుకొనుటకు వసతి కల్పించిన హైస్కూలు కమిటీవారికి, ఉత్సవము జయప్రదముగా జరుగునట్లు తోడ్పడిన వారికి కృతజ్ఞతాభివందనములుసమర్పించిరి.

ఈ రజతోత్సవ సందర్భమున మాన్యూఫాక్చరర్లు, రిప్రజెంటేటివులు, మిత్రులు, నూతన వస్త్రములతో సత్కరించబడిరి.

---

# రజతోత్సవ సందర్భపు
# అభినందన, సన్మాన పత్రములు

---

సోదరులారా !

ఆంధ్రదేశమునకు, వర్తకలోకమునకు, ప్రధాన పట్టణమగు మన విజయవాడ పట్టణమునందు 25 వత్సరములనాడు శ్రీ సీతారాం జనరల్ స్టోర్సు పేర నొక సంస్థను స్థాపించి విజయవంతముగా సంస్థను నిర్వహించుచూ పలు ప్రాంతములలో శాఖోప శాఖల నేర్పరచి, యీనాడు యీ సంస్థయొక్క రజతోత్సవము జరుపుచున్న మిమ్ము అభినందించుచున్నారము.

వాణిజ్య విస్తరణాభిలాషులారా !

తాము ప్రప్రథమమున చిన్న వ్యాపార సంస్థగా ప్రారంభించి, యీనాడు మన రాష్ట్రమునందేగాక పలు రాష్ట్రములయందు మీ వ్యాపార సంస్థయొక్క శాఖోప శాఖలను నెలకొల్పి పారిశ్రామిక సంస్థలకు ప్రధానమైన విక్రయ విధానమును బహు పటుత్వముగా నిర్వహించుచూ, పలు పారిశ్రామిక సంస్థల ఏజంట్సుగా కృషియొనర్చు మీ విధానము ఆంధ్రులకు ఆదర్శమగుగాక !

అభ్యుదయగామీ !

మీరు వ్యాపార సంస్థలను నిర్వహించుటలో యీనాటి సోషలిజం విధానము ఆనాడే ఆచరణకు తెచ్చినారు. మీ సంస్థలలో పనిచేయు అనుభవజ్ఞులను భాగస్వాములుగా నిర్ణయించి, వర్తకాభివృద్ధికై కృషియొనర్చుటకు మీరొసంగిన తోడ్పాటు యీనాటి కాంగ్రెసు మహాసంస్థయొక్క ఉత్తమ ఆశయమును నెరవేర్చు మీ విధానమును అభినందించుచున్నారము.

విద్యాభిమానీ !

మన పట్టణమునగల ప్రధాన సంస్థలలో నొకటియైనట్టి విద్యాసంస్థయగు శ్రీ కన్యకాపరమేశ్వరీ విస్సంశెట్టి వెంకటరత్నం హిందూహైస్కూలు కమిటీ ఉపాధ్యక్షులుగ నుండి సేవయొనర్చుచూ ఇంకను పలు సంస్థలలో సభ్యులయి స్థానిక ప్రజాహిత ఉద్యమములకు శక్తివంచనలేక కృషియొనర్చుచూ, విద్యాభివృద్ధికి ప్రజాహిత కార్యములకు తోడ్పడు మీ విధానమును, మీ నిరాడంబరత్వమును, మీ కార్యదీక్షను వర్తక లోకమునకు ఆదర్శమగుగాక !

ఆర్యులారా !

ఈ నాడు వర్తకసంస్థలు రజతోత్సవములు జరుపు విధానము మీరున్నూ ఆచరించుచూ ఆంధ్ర వాణిజ్య ప్రముఖులను, పారిశ్రామిక వేత్తలను స్మరించుచూ వారి చిత్తర్వులు స్మారకచిహ్నములుగా నెలకొల్పు విధానమును ఆచరణకు తెచ్చిన యీ నూతన విధానమును అభినందించుచూ మీ సంస్థ వర్తక లోకమునకు ఆదర్శ సంస్థగా అభివృద్ధిచెంది సువర్ణోత్సవము జరిపించుటకు మాతా సువర్ణదుర్గ సదా తోడ్పడుగాక !

విజయవాడ. 26-2-56. జైహింద్ !

అన్నవరపు సుబ్బారావుగుప్త
'భారతీయ వైశ్య' సంపాదకులు

(155 పేజి చూడుడు)

# కాలిబాట

## "పగడండీ"

మూలం :
శ్రీ కమలాకాంతవర్మ

అనువాదం :
"ప్రవాహ"

(గతసంచిక తరువాయి)

నా మీద అతనికి ఎట్టి సానుభూతి లేనప్పుడు నేను అప్రసన్నురాలనైప్పటికీ చింతలేనప్పుడు నన్ను అంగీకరింపచేయాలని అతని కెట్టి పట్టుదల లేనప్పుడు నేను అతనికొరకెందుకు బాధపడుతున్నాను? అతడు హృదయహీనుడైనప్పుడు నేనుకూడా హృదయహీనురాలను కాగలనా? ఒకవేళ అతడు ఆత్మను నిగ్రహించగల్గినప్పుడు నేనుకూడా స్వయంగా సమరసమును అలవరచకొనగల్గుదునా? యిక ముందెన్నడూ అతనితో జగడమాడను. ఒకవేళ జగడమాడినచో మాట్లాడనని ఒట్టుపెట్టుకొన్నాను. సరే ఏదైనప్పటికీ ప్రేమకోసం వ్యక్తిత్వమును కళంకితమొనర్చను.

ఆశ్వీయుజ మాసము నాటి ఒక మాట. వర్షాకాలము అప్పుడే గడచిపోయినది. బురద, దుమ్ము లేదు. పచ్చని గడ్డిలో అడవి పువ్వుల మధ్యనుండి నేను మామిడితోపులో ఒక మూలనుండి రెండవమూల వరకు పరుండినాను. ఈ పచ్చదనములో నన్నుచూచి సుకుమార కన్య పాపిటాయని అననివారు లేరు. శరద్రతు శుభ్రజ్యోత్స్న నా ప్రత్యంగములందు ప్రతిబింబించుచున్నది. నేను ఏదో ఆలోచించు సమయమున 'పగడండి వినుచున్నావా' అని అకస్మాత్తుగా బావి అడిగెను.

బావి:- నీవు దినదినము లావగుచున్నావు. (మరల కొద్ది ఆగి) నీవు మొదట సన్నగా యున్నప్పుడు బాగుగా యుండెడిదానవు.

పగడండి:- ఒకవేళ నేను లావైయున్నచో, కేవలము నీకు బాగా యుండుటకొరకు సన్నగా మారను.

బావి:- నాకు బాగా నచ్చుటకు నీవు సన్నగా మారమని నేను చెప్పుటలేదు.

పగడండి:- అయితే నీవు చెప్పేది ఏమిటి?

బావి:- సన్నదనము స్త్రీలకు సౌందర్యము చేకూర్చునని కవులు చెప్పియున్నారు. లావైనచో నీవు కవుల సౌందర్యపు నిర్వచనమునకు దూరమైపోతావు.

పగడండి:- అయితే నీవు నిన్నే కవిగా ఒప్పుకొనుట లేదుగదా?

బావి:- ఎంతమాత్రము కాదు.

పగడండి:- మరల లావైనచో నేను కవులకు బాగా నచ్చేదనో లేక చెడుగా యుండెడిదాననో దీనితో నీకేమి సంబంధమున్నది?

బావి:- ఎమిలేదు. కేవలము నేను ఆ పరిభాషను బాగుగా ఎరుగుదును. అందుచేత దానిని నీకు గూడా తెలియజేయుట నా కర్తవ్యమని తలంచుచున్నాను.

పగడండి:- ధన్యవాదములు.

నిజంగా స్త్రీ ఏదైనా సహించగలదు. కాని తన రూపతిరస్కారమును మాత్రము సహించజాలదు. అబల ఘోర కురూపి కావచ్చును కాని పురుషునికి ఆమె కురూపియని చెప్పే ఎలాంటి నైతిక అధికారము లేదు. స్త్రీకి స్త్రీత్వమే విశ్వ సౌందర్యము. ఆ స్త్రీని సౌందర్యహీనురాలని ఆరోపించినప్పుడు

ఆమె స్త్రీత్వమును అవమాన మొనర్చుటయే. స్త్రీ సౌందర్యమును అవమానపరచుట పురుషుని పిరికి వాడని చెప్పినట్టిదియే. బావి నన్ను మానసికముగా దెబ్బతీయుచున్నది. పరిహాసము కాదు. అవమానము చేయాలనుకొన్నాడు. కాని అంతమేమైనా సరే. నేనుకూడా నేటినుండే వాగ్యుద్ధ మారంభించెదనని మనమున ప్రతిజ్ఞ చేసినాను.

ఆ రోజు రాత్రి వెన్నెల విరియ కాయుచున్నది. రజనీ గంధపు సుగంధము ఆశ్రమవనమును నింపివేసినది. వటదాద పక్షులను నిద్రపుచ్చి తనుకూడా నిద్రపోవుటకు ఉపక్రమించుచున్నాడు. 'అమ్మాయి నిద్రపోయినావా?' అనెను.

పగడండి : లేదుదాదా. యిలాంటి పండువెన్నెల ఎప్పుడూ యుంటుందా? జీవితమంతా ఈ విధంగా పరుండి చంద్రుని ఆలోచించుచూ యుండాలని హృదయం కోరుచున్నది.

బావి:-ఈ రసాలములో పెండ్లిపాటలు యిప్పటి నుండే పాడించుటకు ఏర్పాట్లు చేయిదాదా?

వటదాదా: ఏమి వివాహం?

బావి : చూచుటలేదా? వివాహమనెడి పద్యపు మొదటి చరణము ప్రేమతో ప్రారంభమయ్యెను. రెండవ చరణంలో కవిత్వం తయారవుతుంది. మూడవ చరణంలో ఉన్మత్తతయనెడి అభినయం జరుగును. నాల్గవ చరణంలో వివాహం జరుగును.

పగడండి:-నా మనసు ఉల్లాసముగానే యున్నట్లున్నది. నేడు యితనిని ఏడిపించెదను. నేను నవ్వుచూ దాదాతో, చూడు దాదా ఎవరిభాగ్యం వారిది. ఈశ్వరుడు నిన్నింత విశాలునిగా సృష్టించినాడు. నీవు అసంఖ్యాకములగు సూర్య చంద్రాదుల కిరణములు నిరంతరము స్వీకరించుచూ, మరిదిగ్దిగంతముల వైపునుంచి వచ్చు వాయువులో స్నానము చేయుచూ ఈఅనంతాకాశమున తలయెత్తి ప్రఖ్యాత అమూల్య సంపదను కళంకము చేయుచున్నావు. నక్షత్రములతోనిండియున్న రాత్రులయందు వందలకొలది పక్షులను ఒడిలో తీసుకొని నీవు చంద్రలోకపు కథను వినిపించుచున్నావు.

ఉషఃసంధ్యలు నిత్యం నిన్ను స్నేహపూర్వకముగా ముద్దాడుచున్నారు. ప్రకృతి అమూల్యధనాగారము నీ కొరకు తెరువబడినది. నేను నీవలె ఎత్తులేను. కాని చాల దూరమువరకు వ్యాపించి యున్నాను. అవని తన అమూల్య సంపదను నా ఎదుట వెదజల్లుతున్నది. ఆకాశంలోని సూర్య చంద్రాదుల తీవ్ర కిరణజాలమును నామీద వ్యాపింపజేయుచున్నారు. వసంత ఋతు శోభ శ్రావణమాసపు పచ్చదనము మరి శరదృతువులోని స్వచ్ఛమైనశోభ నా జీవితంలో ఆనందాన్ని చేకూర్చుచున్నవి. నేను కేవలము బ్రదుకుటయే గాదు జీవితోప భోగమునుగూడ అనుభవించుచున్నాను. కాని సూర్య చంద్రాదుల ప్రకాశము చూడలేనివారిని కనుగొని నాకు చాల దుఃఖము కల్గుచున్నది. శూన్యత్వమెవరిగందో మరి అంధకార మెవరి గృహపుగోడలో వారు ఆకాశమును తమలో నింపుకొనునంతటి పెద్దదని తలంచెదరు. వారు చూడగల్గినంత దూరంవరకే పృథ్వీగోళమని తలంచెదరు. దాదా! వారి అస్తిత్వమెంత దయనీయమైనది. యిది మీరెన్నడైనా ఆలోచించినారా అని చెప్పినాను.

దాద ఏమిమాట్లాడలేదు. బహుశా నిద్రపోయినాడేమోకాని బావి ... ... ... 'వినుచున్నావా దాదా! పగడండి ఎంత నిజము చెప్పుచున్నదో అటువంటి ప్రజలకంటె దయనీయ జీవితము మరి యింకెవరిదుంటుంది? కొద్ది రోజులక్రింద నేనుకూడా యిదే ఆలోచించెడివాడను. కాని ప్రపంచంలో యింకా ఎన్నో దయనీయ జీవితములుండవచ్చును. ఈశ్వరుడు సూర్య చంద్రాదుల అవలోకనమునుంచి దంపతులుగాచేసినవారికి ఆకాశ విస్తారము పృథ్వీ వైభవమూ, చూడనివ్వనివారిమీద దయతలంచి

చాలా సూక్ష్మముగా ప్రపంచమునకు ఉపకారమొనర్పగలుగునటువంటి ఒక వస్తువును ప్రసాదించియున్నాడు. దానిని ఆ వంచిత దయనీయ జీవి తనదని చెప్పగల్గుతుంది. దానిద్వారా వారు ప్రపంచమునకు ఏదో ఒక రూపమున ఒక లక్ష్యమునగలదు. కాని దానికంటె అధికమయిన దయనీయులు, ఎవరి వద్దనైతే సృష్టివైభవమంతయు పడియున్నదో కాని వారికి తమదని చెప్పుటకు ఏమీగూడాలేకుండా రేఖాగణితపు రేఖవలె వారి అస్తిత్వమయితే యున్నది కాని వారి లావు పొడవు వెడల్పు అంతా కల్పనామాత్రమే. వారి అస్తిత్వము మరియొకరి అస్తిత్వములో దాగియున్నది. వారు అందరికి సాధనమైనట్టి వారు. కాని ఎవరి దృష్టిలో!

అటువంటి ప్రజలుగూడ ప్రపంచంలోయున్నారు దాదా వారిమీద నీకు దయవచ్చుటలేదా ?'

పగడండి:- దాద పూర్తిగా నిద్రపోయినాడు. నేను కోపంతో బావి! ఒక్క వేళ నీవు ప్రపంచమునకు లక్ష్యమైతే మరి నేను కేవలము సాధనమాత్రమని నీవు తలంచుచున్నచో యిది నీ పొరబాటు. ప్రపంచంలో యున్నది సాధన మాత్రమే. లక్ష్యమే మాత్రములేదు. లక్ష్యమను శబ్దము మానవుని పిచ్చికల్పనల ఫలితము. లక్ష్యము భావనామాత్రమే. స్థూలంగా, ప్రత్యక్ష రూపంలో ఎవరి అస్తిత్వమైనా ఏరూపములో యుండినను అది సాధనయే.

బావి:- (గంభీర స్వరంతో) నీవు నా పూర్తి పేరుతో పిలచినందులకు నా ధన్యవాదములు. నేను నీకు రెండు మాటలు మాత్రము సమాధానము చెప్పతాను. నీకు నాకు ఎలాంటి జగడములేదు. వ్యక్తిగతంగా నీవు నన్నేమి అనలేదు. మరి నేను నిన్ను ఏమిఅనలేదు అనునది మొదటిమాట. నీవు చెప్పచున్నట్లే లక్ష్యము మరి సాధనలో ఆకారాది అంతరాయములు లేనప్పటికీ పారమార్థిక భేదమున్నది. ప్రపంచంలో లక్ష్యమను పేరుతో ఎలాంటి వస్తువు లేదనేది బాగానేయున్నది. యిక్కడ యున్నది ఏదో ఒక రూపంలో సాధన మాత్రమే. యిదిగూడ బాగానేయున్నది. సాధనలలో కొన్ని సాధనలస్థితి; సాధనకంటె వేరు చెప్పలేము. మరికొన్ని సాధనలు ఎలాంటి అవస్థలో ఉన్నవంటె ప్రపంచము తన వీలుకొరకు లక్ష్యమని చెప్పుటయే ఉపయుక్తమని తలంచినది. దీని ప్రత్యక్షము మరి స్థూల ప్రామాణిక మేలాంటిదంటె ప్రపంచము కొంతమందివద్దకు చేతులు జోడించివచ్చి ఏదో కొద్దిగాకోరి వెళ్ళిపోతుంది. ప్రపంచపు స్థూల వ్యావహారిక భావలో వారు మాత్రము లక్ష్యమైనట్టి మరి కొందరు ఎట్లా ఉంటారంటే ప్రపంచమెవరివద్దకువచ్చునో వారివద్ద ఏమితీసుకొనుటకు కాదు. కాని మరి ఎందుకంటె వారిద్వారా అది తన లక్ష్యమునకు చేరుకొనుటకు నీ సూక్ష్మదార్శనిక భావలో అటువంటివారే సాధకులు. తెలిసినదా! యిది రెండవ విషయము.

నేను చెప్పబోవునది ఆమె ఆపివేసినది. 'మూడు నీ వెన్నెల మాయమయినది. యిప్పడయినా నిద్రపోగల్గుదువా లేదా' అని నేను చెప్పినాను.

మరికొన్ని దినములు గడిచిపోయినవి. నా ప్రేమ మీద ఆత్మాభిమానమనెడి బూడిద రాలుచుండెను. బావి ప్రపంచపు లక్ష్యం. నేను కేవలము సాధన మాత్రమే. మరల వానిని నేనేవిధముగా ప్రేమించను? ప్రేమలో స్పర్థ ఎందుకు అని నేను అప్పుడప్పుడు ఆలోచించుచున్నాను. అతడు ప్రపంచంలో ముఖ్యమైనవాడు మరి నేను ఎందుకు పనికిరానని మరల నేను వానిని ప్రేమించితే అతడు దానికి ప్రతిదానమివ్వకపోతే? బావి తన ప్రాపంచిక మహత్వంలో మదించియున్నది. వానెదుట నేనెంత తుచ్ఛురాలనంటె నాతో ప్రేమగా యుండెడిది కల్ల. యధేచ్ఛగా మాట్లాడుట పాపమని భావించుచున్నాడు. అతడు నన్నుచూచి అసహ్యించుకొనుచున్నాడు. యింతేకాక అవమానపరుచుచున్నాడు.

నేను రోజు రోజు అతనినుండి దూరముగా తొలంగుటకు ప్రయత్నము చేయుచున్నాను. వాని సామీప్యమున నేను నిల్వలేక పోవుచున్నాను. అతడు మహత్వకాంక్షి. ప్రపంచము అతనిఎదుటకు భిక్షుకురాలుగా వస్తుంది. మరి నేను? నాకొక అస్తిత్వము లేదు. ఏదో ఒక లక్ష్యాన్ని చేరుకొనుటకు సాధన మాత్రురాలను. నాకు వానికేమి పోలిక?

ప్రాతఃసంధ్యా సమయములందు గ్రామీణయువతులు వచ్చి నీరు నింపుకొని పోవుచున్నారు. రెండు ఝాముల వేళ బాటసారులు ఆ సాలమునందు విశ్రాంతి నిమిత్తమేగి బావిలోని నీరు త్రాగి కొద్దిసేపు వృక్షముల క్రింద పరుండి మరల తమ దారిన పోవుదురు. గ్రామములోని చిన్న చిన్న బాలురు ఆమామిడి తోపులోనికి వచ్చి పండ్లు కోయుదురు. భావిలోనుంచి నీరుతోడి పారబోయుదురు. యింకా కొమ్మలు విరగదీయుచూ అల్లరిపనులు చేయుచూ ప్రొద్దుగుంకిన తరువాత యింటికు పోవుదురు. ఎక్కడైనా చూడు అతని చర్చే అతనిమాటే. నేను నా గణ్యత మీద మనసులోనే బాధపడుతున్నాను. ప్రపంచము నన్ను నిందించుచున్నట్లు ఆకాశమునన్ను తిరస్కరించుచున్నది. పృధ్వి తన్ను అవహేళన చేయుచున్నట్లుగా నాకు అనిపించుచున్నది. నా అస్తిత్వము రేఖాగణితపు రేఖవలె మరి బిందువులవలె ఉన్నది. నేను అందరి దాననే. కాని నా కెవ్వరూ లేరు. నేనుకూడా నా దానను కాను. కేవలము ప్రపంచమును ఏదో ఒక లక్ష్యమువరకు చేర్చుటకు సాధనలాగ తయారై బ్రతుకుచున్నాను. నేనిక్కడనుండి తొలగవలసినదే. ఎక్కడికైనా వెళ్తుతాను. తప్పకుండా వెళ్లుతాను హృదయ శాంతినిమిత్తం వనవనము తిరుగుతాను. భూమిని ఈ చివరనుంచి ఆ చివరవరకు ఈ అనంత విస్తారమును కూడా వెతుకుతాను. దురాభాగ్యవశాత్తు ఎక్కడైనా శాంతిలభించక పోయినచో ఏదో ఒక మరుభూమికి సంబంధించిన యిసుక తిన్నెలలో లీనమై పోతాను. లేక ఏదో ఒక నిర్జన పర్వత శ్రేణి అంధకార కొట్టంలో నిద్రపోతూ యుంటాను. ఏమైనా సరే యిక్కడ యుండను. అక్కడనుండి తొలంగుటకు ఏర్పాట్లు చేయుచున్నాను.

అర్థరాత్రి వెన్నెల అంధకారములు ఒకరి బాహువులలో ఒకరు గాఢముగా నిద్రము పోవుచున్నారు. నాకారోజు మాటలు యిప్పటి నిన్నటి మాటలవలె గుర్తుయున్నవి. నేను నా అతీత జీవితపు చిన్న చిన్న స్మృతులను సర్దుకొను సమయంలో పగడండి; అని భావి పిలచెను.

అర్థరాత్రి శూన్యత్వములో అతని వాణి ప్రతిధ్వనించుచున్నది. నేను తృళ్లిపడినాను. యిన్ని రోజుల తరువాత నేడు భావి నన్ను పిలుచుచున్నాడు. నాలో ఉత్సాహము పొంగి పొరలుచున్నది. ఏమిటియని నేనడిగినాను.

బావి:—కొద్ది సేపు మెదలకుండాయుండి మరల, పగడండీ! యనెను.

పగడండి:—బహుశా నేను పలికినది వినలేదేమో. నాకు ఆశ్చర్యము కల్గుచున్నది. నేడు ఏదైనా అభినయము జరుగునా? నేను సంయతస్వరంలో మరల ఏమిటి అని అడిగినాను.

బావి:-పగడండి:—నేను నిన్నొకమాట అడగదలచినాను

పగడండి:—అడుగు

బావి:-బహుశా నీవు యిక్కడనుండి ఎక్కడికైనా వెళ్ళ గోరుచున్నావా?

పగడండి:—ఆ సమయమున పిడుగు పడిన కల్గినంతటి ఆశ్చర్యము కలిగినది. బావికట్లా తెలిసినది? ఏదో విధంగా తెలిసిందని ఒప్పుకొంటాను.

మరల బావికేమి సంబంధమున్నది. నేను క్షణములోనే అనేక రకములుగా ఆలోచించినాను. అనేక భావములతో నా హృదయము అల్లకల్లోలమైనది కాని యీవత్తు ఆవేశము నాపుకొని ఉదాసీనంగా ఔను అని చెప్పినాను.

బావి:—కొద్ది సేపు మెదలకుండాయుండి నీ విక్కడినుంచి పోవుచున్నావా? బాగానే యున్నది. నేను చాల సంతోషించుచున్నాను.

పగడండి:—నేను చెప్పబోవు సమయమున బావి ఆపెను.

బావి:—ఆగు నా మాట విను. నీవు మొదటగా యిక్కడకు వచ్చినప్పుడు నేనెంత ప్రసన్నత నొందినానో అంతగా యింకెవరు కారు. నేడు ఎప్పుడు నీవు యిచ్చటినుండి వెళ్ళుచున్నావో అప్పుడు నేనెంత సంతోషించు చున్నానో అంతగా యింకెవరు లేరు. నీవు దీనికి కారణ మెరుగుదువా?

(సశేషము)

# మాంచాల

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

[మాంచాల తన మనోహరుడు బాలచంద్రుని గూర్చి తియ్యని కలలుకంటూ ఉంది.]

మాంచాల:-రాజా ! నీ చిన్నారివదనాన్ని చూడాలని ఈ కన్నె హృదయం ఎంత ఆరాటపడుతున్నది! ఆ నాడు మన వివాహ సమయంలో మీ సుందర విగ్రహాన్ని చూశాను. నా హృదయం పరిపూర్ణమయింది. స్వామీ మీ అరుణచరణాలను పూజించే భాగ్యము ఈ దీనురాలకి ఎన్నడు లభిస్తుందో గదా ? ఆహా చంద్రా! నా బాలచంద్రుని పిలుచుక రాక నేవస్తున్నావా? నన్ను బాధిస్తావా ? ఈ రాత్రి నా బాలచంద్రుడువస్తే-అవును నా హృదయంతో స్వాగతమిస్తాను. వారి పాదాలను నా ఆనంద బాష్పాలతో కడుగుతాను. నా రాజును నా బాహులతా పంజరంలో బంధించుతాను. స్వామీ చెన్నకేశవా ! నేను ఏం పాపం చేశాను దేవా ? నా ప్రభువును నా వద్దకు రప్పింపవా ?

[బాలచంద్రుడు యుద్ధరంగానికి బయలుదేరుతాడు. కాని మాతృమూర్తి ఐతాంబ అనతి ప్రకారం భార్య దీవెనకొరకు మాంచాల గృహానికివచ్చాడు.]

మాంచాల:-ప్రభూ ! వచ్చారా ? ఆగండి. నా ఆనందాశ్రువులతో మీ పాదాలను కడుగుతాను. ఆహా ! మీ వంటి సుందరమూర్తిని భర్తగా బడసిన నేనెంత ధన్యురాలను. మనోహరా ! నా జన్మచరితార్థమైనది రారాజా ? ఈ శరీరంలోని ప్రతిరక్తకణం నీ నామాన్ని జపిస్తుంది. నీ కొరకు వెన్నెలలేని చకోరపక్షివలె కాలం గడుపుతున్నాను. ఈ నాటికి జన్మ తరించింది. నా కోర్కె ఫలించింది.

[బాలచంద్రుడు మాంచాల మనోహర విగ్రహాన్ని చూచి ఆశ్చర్యపోతాడు. అతని యువక హృదయం ఉప్పొంగిపోతుంది. వచ్చిన పనిని మరచిపోతాడు.]

బాలచంద్రుడు:-మాంచాలా ? ఎంత అందమైనదానివి నీవు యీ-నీనీలపు ముంగురులు అంత అందముగా ఉన్నవి. ఈ నీ సుందర రూపమే నా హృదయంలో నిద్రపోతున్న కోర్కెలను మేల్కొల్పినది. నీ నిర్మలమైన అమాయిక చూపులు నీ అందాన్ని మరింత శోభతో నింపుతున్నవి. మాంచాల ఎంత అందమైనదానివి ?

[మాంచాల సిగ్గుతో తలవంచుకుంటుంది. బాలచంద్రుడు ఆ మెదగ్గర చనువుగా ప్రవర్తించబోతాడు.]

మాంచాలా! ఎందుకీతొట్రుపాటు! నీ బాలుడు నిన్ను యిన్ని దినాలు గమనించలేదన్నా? విరహమే కదా ప్రేయసీ ప్రియులను దగ్గరకులాగేది. నీతో విహారముకొరకు నా హృదయము ఉవ్విళ్లూరుతుంది.

అగురాణీ! ఎందుకలా తొలగిపోతావు. అదిగో తెల్లని వెన్నెల. నీ వక్షస్థలంమీద పడితే నీ హృదయభారం నల్లగా నీడలాగా కనపడుతుంది. ప్రేయసీ! నా హృదయ మందిరంలో నీ రూపు హత్తుకపోయింది. ఈ సుందరమైన రాత్రిని అందాల భరిణ నా మాంచాలతో గడుపుతాను. నా జన్మను సార్థకపరచుకొంటాను.

మాంచాల:-ప్రభూ పూజ్యురాలు అత్త గారు కుశలమేనా?

బాల:-మరచాను మాంచాలా! నలగాముతో సంధి విఫలమైంది. కారెమపూడిలో యుద్ధము ప్రజ్వరిల్లుతూంది. నాన్నగారికి సహాయునిగా వెడుతున్నాను. అమ్మ దగ్గర శెలవుతీసికొన్నాను. నీవు నీ నేత్రాల దీప్తితో నీ హృదయ నిర్మలత్వంతో నన్ను యుద్ధరంగానికి సాగనంపాలి. మాంచాలా! ఆ శత్రుమూకను చెండాడి విజయలక్ష్మిని నీకు చెల్లెలుగా తీసికొనివస్తాను. నా రక్తంలో పగ ప్రవహిస్తూంది. శత్రువులను ముక్కముక్కలుగా నరికివెయ్యాలి. ఆ రక్త ప్రవాహంలో నా యీ కరవాలము నాట్యంచేయాలి.

మాం:-జై బాలచంద్రా! విజయలక్ష్మి నేడే నిన్ను వరించింది. పలనాటిని మనమే పాలించుకుంటాము. ప్రజా సమూహానికి పరిపాలనా సౌలభ్యాన్ని కలుగచేద్దాము. బాలచంద్ర ప్రభువుకు సాటివేరేలేరని పలికేటట్లు చేద్దాము. రాజా పాలు తెస్తాను కూర్చోండి!

[పాలకొరకు పోయిన మాంచాల తల్లికి సర్వం నివేదిస్తుంది. కాని యుద్ధరంగానికి వెడలే ప్రియునితో ప్రేయసి చనువుగా ప్రవర్తించకూడదని, అది విజయానికి దోహదం చెయ్యదని, ఎలాగైనా ఈ రాత్రి దూరంగా ఉండేలాగా చూచుకోమని బోధిస్తుంది.]

మాం:-చెన్నకేశవా! ఎన్ని రోజులనుండి ఎదురుచూచాను స్వామీ! నా ప్రభువువస్తే నేను దూరంగా ఉండేదా! యిదేం న్యాయం స్వామీ! నా భర్తతో సుఖంచే భాగ్యము నాకు లేదా! నా యవ్వనం నా ప్రభువుకై వశంకాదా! దేవా నాకెందుకీ సౌందర్యాన్ని ప్రసాదించావు. చందమామ ఆకాశంలో విహరిస్తున్నా, కోయిల కూతవిన్నా, చిరుగాలి అలలతో ఆడుకొంటున్నా నా పతి పాదాలపై

కూర్చోవాలని ఉంటుందే - అట్టి నా కోర్కెలన్నీ వమ్ముపాలు కావలసిందేనా! అమాయికంగా బాలుడు నా వైపు చూస్తుంటే నేనెట్లా వారించేది! చంద్రుడు నా పవిటనుపట్టి లాగితే నేనెట్లా కాదనేది! బాలచంద్రుని మృదువైన వేళ్లను నా నల్లని నీలిముంగురులలో జొనిపి మాంచాలా! అంటే నేను ఏమని సమాధానము చెప్పేది. నాలుగు జాముల రాత్రిని నేనెట్లా గడిపేది! భగవంతుడా? అవును. గడుపుతాను. నా పతి విజయంకొరకు ఈ రాత్రినే కాదు నా జీవితాన్నే చిరునవ్వుతో త్యాగంచేస్తాను. భారత స్త్రీకి పతి కన్న మిన్నయైనది లేదు. నా పతి రణరంగంలో వీరవిహారంచేసి విజయుడై రావాలి. ఆ నాడు నా శరీరాన్ని వారి కైవశంచేస్తాను. ఇది పలునాటి బిడ్డ కొకలెఖ్ఖా? భారత స్త్రీ భర్త కొరకు ప్రాణాలనుకూడా త్యాగం చెయ్యగలదు. అవును ... ఈ క్షణిక సుఖానికాసించి శాశ్వతకీర్తిని నాశనం చేస్తానా? చెయ్యను ప్రభూ? నీ శ్రేయస్సే నా శ్రేయస్సు! మిమ్ము సంపూర్ణంగా యుద్ధరంగాని కంపుతాను ... త్యాగంచేస్తాను. అయినా ఎట్లా గడవదో చూస్తాను.

[మాంచాల పాల గ్లాసుతో ప్రవేశిస్తుంది. బాలచంద్రుడు ఆమె కరాని పట్టుకొని కౌగలించుకో బోతాడు.]

మాం: ప్రభూ! అదుగో దొంగ చూస్తున్నాడు?

బాల:-(చివాలున చెయ్యివదలి) ఎవరాతడు?

మాం:-(చంద్రునివైపు చూపుతుంది.)

బాల:-(నవ్వుతూ) మాంచాలా నీవు అపూర్వ సౌందర్యవతివే కాక సరసురాలవుకూడా?

మాం:-ప్రభూ! తమ స్నేహితులు క్షేమమా? అత్త ఐతాంబగారు ఆరోగ్యంగా ఉన్నారా?

బాల:-మాంచాలా నీ హృదయం ఎంత ప్రతిభావంతమైనది. ఆహా ... నీ పలుకులు అమృతములాగున్నవి?

మాం:-ప్రభూ! అమృతమంటే గుర్తుకొచ్చింది. అమృతం ఎక్కడనుండి వచ్చింది. దాని ప్రభావమేమిటి?

బాల:-దేవీ! అవి తీరిక సమయములో మాట్లాడుకోవలసిన మాటలు. ఈ రేయి హాయిగా గడపాలి. వృధాకాలహరణం చెయ్యకు. రారాణీ! నా కోర్కె చెల్లించు.

మాం:-ఆగు రాజా! నీ రూపాన్ని మన సారా చూడనీయండి? ఆహా ఎంత అందంగా ఉన్నారు?

బాల:-అవును, మాంచాలా దగ్గరికివచ్చి చూడరాదా?

[మాంచాల ఎంత మరపించినా బాలుడుద్రిక్త డౌతున్నాడు. ఆమె అన్యధా ప్రసంగం పని చెయ్యలేదు. కాని మాంచాల మనసు రాయిచేసి కొన్నది. బాలునితో ఏకాంతంగా 4 జాముల రాత్రిని గడపటానికి ఆలోచించింది. అతడు ఆమెను పట్టుకున్నపుడు తన మెడలోని పూసలదండను త్రెంచింది.]

మాం:-స్వామీ చూశారా? తొందరలో నా హారాన్ని త్రెంచారు?

బాల:-అవును మాంచాలా! తొందరలో పొరపాటు జరిగింది.

మాం:-స్వామీ! చెన్నకేశ్వరుని పేరున ధరించిన దండ, అమ్మకు తెలిస్తే ...

బాల:-అట్లాగా! అయితే ఎంతలో కి కూర్చుదాము - దారముందా?

మాం:-ఉంది స్వామీ - అటు మీరు, యిటు నేను కూర్చుదాము.

బాల:-నిజంగా అర్ధాంగి వనిపించావు మాంచాలా!

[బాలుడు ఒకవైపునుండి కూర్చుతుంటే మాంచాల మరియొకవైపునుండి దూసిపోస్తున్నది. ఎంత కూర్చినా పూర్తికాలేదు. ఇంతలో తెలతెల వారింది. బాలుడు తొందరపెట్టసాగాడు.]

బాల:-మాంచాలా ఎంతకూర్చినా తరగనిదండయిది. తరువాత కూర్చుదాము, ఆహా ...

పచ్చని చీరదాల్చి చిరు పయ్యెద క్రిందికి జారి
పోవగా
ముచ్చటగా చివాలు మన ముందుకు వంగగ సుంద
రాంగి! నీ
కుచ్చుల నీలవాలుజడ కూర్చిను కమ్మని పూల
వాసనల్
అచ్చని సుందరాంగి అనుమానమదేలనె రమ్మ
కూడగా?

మాం:-ప్రభూ మీరెంత పిచ్చివారు? మీరు చేయబోయే కార్యమా యుద్ధము - అడుగిడే స్థలమా రణరంగము - చేయునదా శత్రుసంహారము-కోరునదా! స్త్రీ సంభోగము! రాజా సమరదీక్షితులకు ఇది సముచితముకాదు. రక్తతిలకాన్ని పాలభాగాన్నిదిద్దుకొని భారతమాత మిమ్ము కర్మవీరుణ్ణిచేస్తున్నది ప్రభూ! లేవండి- రణరంగంలో శత్రుసింహాలను చెండాడండి. కృపాణంతో కుత్తుకల నరకండి! మీ వీరనినాదాలు వింటుంటే నా హృదయం ఉప్పొంగిపోతూంది. ఆ శత్రుశిరాలే నా పూజాపుష్పాలగా చేస్తాను. ప్రభూ! నాకు వీరపత్నిత్వాన్ని ప్రసాదించండి - పలునాటి చరిత్రలో నా పేరును 'త్యాగమూర్తి'గా వీరపత్నిగా సువర్ణాక్షరాలతో లిఖింప

చేయండి. మనోహరా! స్వాతంత్ర్య సిద్ధికిచేసే సమరంలో చనిపోయినా బ్రతికినా మనదే స్వర్గము. ఇదిగో కరవాలము ...

బాల:-మాంచాలా! నాయువక హృదయం నీ సుందరరూపాన్ని చూడగానే ఉద్రిక్తపడింది. నీ అమాయిక చూపులు నా ఆశను మరీ రెచ్చగొట్టినవి. మానవస్వైజాన్ని మానలేక పోయాను, మన్నించు మాంచాలా! ఆ నాయకురాలి తలనరికి నలగామునిపట్టి నాన్న పాదాలపై వేసి నీ మాటను రణసీమలో నిలుపుతాను. దేవీ! దీవించిపంపు.

మాం:-విజయమూర్తీ! నీ శత్రువులు నామరూపాలు లేకుండాపోతారు. కరుణాకరా! నీ ప్రజలు నీ రాజరికంలో ఆనందమయులౌతారు. రతిరాజ సుందరా! నీ దాసి మాంచాల నీ రాకకై వేచిఉంటుంది. కృష్ణునికి సాటిగా నీకు కీర్తి లభిస్తుంది. మాచర్ల చెన్నకేశ్వరుడు వరములను యివ్వగా వర్ధిల్లుతారు. కలియుగంలో మీకు ఘనమైన పూజలమరుతవి. శౌర్య సుందరమూర్తీ! నాకు వీరపత్నీత్వము, అత్తగారికి వీరమాతృత్వము ప్రసాదిస్తారు. పలనాటిని జయిస్తారు. శత్రువులపై పగదీర్చుకొంటారు. ప్రభూ! యిదిగో రక్త తిలకం.

[అని తన బొటనవ్రేలిని కరవాలంతో గ్రుచ్చి రక్తాన్ని బాలుని ఫాలభాగంలో అలంకరిస్తుంది.]

బాల:-మాంచాలా! మరలా విజయలక్ష్మితో తిరిగివస్తాను.

మాం:-ప్రభూ! స్వాతంత్ర్యసిద్ధే మన పరమాశయము. శత్రుసంహారదీక్షయే మన చరమ లక్ష్యము. ప్రజాశ్రేయస్సే మన జీవిత పరమార్థము. విజయపతీ! నీ సందర్శనమే నా పూజా ఫలము. జై బాలచంద్రా ...

(బాలుడు యుద్ధరంగాని కరుగుతాడు)

(144 పేజీ తరువాయి)

శ్రీరామ లక్ష్మణులవలె। శ్రీరాం సోదరులు ఘనులు సీతాపతియున్
ధీరుండు భీమశంకరు। డౌ రాయల కివిగో మాదు నభినందనముల్ ॥

సీతారాం జనరల్ స్టోర్సు - అతతమయి వారిచేత నభివర్ధితమై
ఈ తఱి సిల్వర్ జూబ్లీ - ఖ్యాతిన్ గనుచుండె వేడుకలు పెంపారన్ ॥

ధరలోనన్ బెజవాడలో మఱి సికింద్రాబాదులో నాపయిన్
బరహంపూరును బెంగుళూర్ మధురయున్ ప్రఖ్యాతిగన్నట్టి యీ
పురరాజంబులలో స్వకార్య భవనంబుల్ పెట్టి సాగించుచుం
డిరి వ్యాపారము వారికిన్ ప్రజలకున్ నిత్యోత్సవ శ్రీలుగాన్ ॥

తమ లాభంబుల కేమిగాని ప్రజకుం దత్కాల సౌకర్య లా
భములన్ దేశపరిశ్రమంబులకు నేపారంగ బ్రోత్సాహ లా
భములన్ గూర్చుటయే స్వధర్మమనుచున్ భావించి త్యాగంబు ధ
ర్మము సౌహార్దముమీఱ కార్యములు దీర్పన్ నేర్పు లొప్పంగదా! ॥

అన్నదమ్ములౌ వీరికి నలరుగాక - ఆయురారోగ్య భోగభాగ్యంబు లెపుడు
పొరిది గోల్డను డైమండు జూబిలీలు-జరుగుగాక యీ స్టోర్సు కుత్సవములొప్ప. ॥

మహాకవి, శివభారత కర్తలు
శ్రీ గడియారము వేంకటశేష శాస్త్రిగారిచే
రచియింపబడినవి

ఇట్లు,
ది ఐకోల్డులోవర్ డిపో,
ప్రొద్దుటూరు



# రాధ

శ్రీ పోలిశెట్టి నాగేశ్వరరావు

కృష్ణుడు భావప్రపంచంలో విహరిస్తూ ప్రేమ గీతాలు అల్లుకుంటున్నాడు. రాధ చక్కగా ముస్తాబై వచ్చి అతని వెనక నిల్చుంది. ఆమె అక్కడకు వచ్చినట్టు అతనికి తెలియదు. ఆలోచనలో మునిగి, తనలో తాను మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ రచన సాగిస్తున్నాడు.

రాధ కొంతసేపు అలాగే చాటుగా వుండి, అతని వంక దొంగ చూపులుచూస్తూ, వచ్చేనవ్వు ఆపుకుంటూ అతనికళ్లు మూసింది.

రాధ కోమలకరద్వయం కంగారుగా వదిలించుకుని వెనక్కి తిరిగి చూశాడు కృష్ణుడు. రాధ నవ్వుతూ ప్రత్యక్షమయింది ప్రణయదేవతలాగ. ఆమెని చూడగానే, కృష్ణుడి హృత్కాసారంలో కొన్నికోట్ల ప్రణయకెరటాలు లేచి, అతణ్ణి ఆనంద డోలికల్లో వూగించినై.

"ఓహో! తమరా ... ఎవరో అనుకున్నా."

"ఆఁ ... నేనే ... ఇప్పటికైనా ఈ లోకంలోకి వచ్చారా! ఎవరితో ఆ మాటలు?"

"ఇంకెవరుంటారు? నా ఆరాధ్య దేవతతోనే."

"ఎవరబ్బా! ఆమె" అసూయగా చూస్తూ అడిగింది రాధ.

"ఉందిలే, నేను మనసారా ప్రేమించిన అమ్మాయి. అంతేకాదు రేపో మాపో పెళ్ళికూడా చేసుకోబోతున్నా ... తెలిసిందా?"

"బావా! అయితే ... ఆ అమ్మాయి ఎక్కడ వుంది?"

"భావ ప్రపంచంలో."

"నీకో ప్రపంచంకూడా వుందేమిటి బావా?"

"చెప్పేది బాగా విను. బావ ప్రపంచంకాదు ... భావ ప్రపంచం."

"అంటే, ఎలా వుంటుంది?"

"నీలాగే సర్వాంగ సుందరంగా వుంటుంది."

"పోదూ ... చెప్పు బావా?"

"చెప్పనా. అయితే విను. అక్కడ ఆకాశాన్ని అంటే హిమాలయ పర్వతాలు వుంటాయి. వాటిపైనుంచి జలజలా ప్రవహిస్తుంది, యమునాస్రవంతి. దానికి రెండు పక్కలా ఇసుక తిన్నెలు-వాటి నానుకుని నందనవనాల్లాంటి పూలవనాలు. ఎక్కడ చూసినా వెండిలాంటి వెన్నెల. ఇంకా అక్కడ యమున కెరటాల్లో వుయ్యాలలూగి పిల్లగాలి చల్లగా వీస్తుంది. కోయిలలు 'కుహూ...కుహూ' కూస్తాయి. తుమ్మెదలు 'ఝుమ్మ ... ఝుమ్మ'న పాడతాయి. నెమళ్లు ఆడతాయి. అది నిజంగా స్వర్గసీమే - కాదు, స్వప్న సీమ. అదే నా భావ ప్రపంచం. అందులోనే విహరిస్తూవుంటుంది నా ఆరాధ్యదేవత."

రాధ భావగర్భిత వదనంతో రెప్పవాల్చకుండా చూస్తూ అలాగే వుండిపోయింది. ఆమెని చూసి కృష్ణుడికి నవ్వు వచ్చింది.

"చూశావా? నా తమాషా ... నువ్వుకూడా భావ ప్రపంచంలో విహరిస్తున్నావు. లేకపోతే నన్ను ఎగతాళిచేస్తావా?"

"ఇక చెయ్యనుగాని, ఆ అమ్మాయి ఎవరో చెప్పు బావా" అంది వూపిరి బిగపట్టి రాధ.

"చెప్పనా ... ఆ అమ్మాయే రాధ ... అంటే నువ్వే." ఆమె మెత్తని బుగ్గలు వేళ్లతో తడుతూ అన్నాడు కృష్ణుడు.

"అబ్బ! నేనేనా!" ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది రాధ. ఆమె వదనం ఆనందచంద్రికలని వెదజల్లింది.

"ఏదో పనిమీద వచ్చినట్టున్నావు."

"అయ్యో! వచ్చిన పనే మరిచిపోయా. ఈ జేబు రుమాలుమీద మంచి చిత్రం గీసియ్యి బావా... పోయి కట్టుకోవాలి."

"ఎందుకు?"

"రేపు కాలేజికిపోతే మరదలు జ్ఞాపకం వుంటుందో లేదో. మరదలు జ్ఞాపకార్థం బావగారికి సమర్పించుకుందామని."

"ఇదా ... బావగారికి?"

"మరింకేం కావాలి బావా?"

"నేనొకటి అడుగుతా యిస్తావా?"

"బావగారు అడగటం యివ్వకపోవటమూనా?"

"అయితే యిలా దగ్గిరికిరా."

"ఊఁ ..."

"మొహం పక్కకు తిప్పు."

"ఊఁ ..."

"రాధ మెత్తని పసిడి చెక్కిళ్లమీద కృష్ణుడు పెదవులు ఆనించబోయాడు.

"పోదూ -" బుంగమూతిపెట్టి వెళ్ళిపోయిందామె.

"రాధా ... రాధా ... యిలారా ... మూతి ముడుచుకున్నావేం? మరదలుగారికి కోపంరాలేదు కదా - మంచి మాట చెబుతారా."

రాధ తిరిగి అతని దగ్గిరికి వచ్చింది. ఆమె చేతిలోని జేబు రుమాలు తీసుకుని చిత్రం గీసివ్వటం ఆరంభించాడు. దానికి వ్యాఖ్యానంకూడా ప్రారంభించాడు.

"రాధా! ఇదిగో చూడు - వసంతాగమనమయింది. ప్రకృతి నవచైతన్యశోభతో కళకళలాడుతూవుంది. వసంతవనంలో యిదిగో యవ్వన వికసిత, మకరందపూరిత, మనోహర పుష్పం. మకరంద మాధుర్యాన్ని ఆస్వాదించమని మధుపాన్ని ఎలా ఆహ్వానిస్తుందో చూశావా? అందం నాకే కదా వుందని నీ లాగ మూతి ముడుచుకుందా?"

"అవును బావా, నువ్వు చెప్పిందంతా నిజమే. పాపం! పుష్పం మధుపాన్ని చూసి సంతోషంతో స్వాగతమిస్తుంది. నమ్మి తన సర్వస్వం సమర్పిస్తుంది. కాని ఆస్వాదించి, ఆనందించిన అనంతరం మరో పుష్పంమీదికి పోతుందని దానికేం తెలుసు?"

"చాలా గొప్పగా మాట్లాడేవే! ఉండు ఈ సంగతి మధుపంతో చెబుతా. 'ఓ మధుపమా! మా రాధ చెప్పే సలహావిను. బాగుపడతావు. నీ పుష్పం ఎంత కోపగించుకున్నా, ఎంత బతిమాలినా నవ్వకుండా మూతి బిగించుకున్నా నువ్వే నాకు దిక్కు, ఇంకే పుష్పం నాకీ ప్రపంచంలోనే దొరకదని బ్రతిమాలుకో. లేకుంటే నిన్ను మా రాధ అన్ని పుష్పాల్లో దూరే రకం అనేస్తుంది.' ఆఁ... చెప్పాను చాలా?"

"ఆఁ ... చాలు ... ఎక్కువ" నవ్వు ఆపుకుంటూ అందామె.

"ఈ రాత్రి మేమంతా సినీమాకి వెళ్తున్నాం. నువ్వూ వస్తావా బావా"

"ఏం సినీమా-పోనిద్దూ. వాళ్లందరినీ వెళ్లనియ్. నువ్వు మాత్రం ఏతలనొప్పో అని ఆగిపోదూ. మనం ఈ రాత్రి చాలా విషయాలు మాట్లాడుకోవాలి."

"చిత్తం" అంటూ రాధ మెరుపులాగ మెరిసి మాయమయింది.

♦ ♦ ♦

అది ఆనందం వొలకబోసే వెన్నెల రాత్రి. మేఘ కన్యల మధ్య చంద్రుడు ఆడుకుంటున్నాడు. మాలతీ లత మధుర పరిమళాలని వెదజల్లుతూవుంది.

రాధా కృష్ణులు మేడపై అంతస్తులో కూచున్నారు. ఆ వెన్నెల్లో వారు రతీ మన్మథుల్లాగ మూడ ముచ్చటగావున్నారు.

కృష్ణుడు కొంచెం పొడుగ్గా వుంటాడు. విశాలమైన వక్షస్థలంతో అందంగా వుంటాడు. తెల్లని పంచెకట్టుకుని సిల్కు లాల్చీ తొడుక్కున్నాడు. అతని జుట్టు వెన్నెల్లో నిగనిగలాడుతూవుంది.

రాధ అంత పొడుగూ కాదు పొట్టీ కాదు. ఎర్రగా వుంటుంది. విశాలమైన కళ్లూ, తీర్చిన ముక్కూ వుంటాయి. లేత వూదారంగు సిల్కు చీర కట్టుకుని, తెల్లని వాయిల్ రవిక తొడుక్కుంది. తలలో పూవులు తురుముకుంది. మెడవొంపులో ఒంటిపేట గొలుసు జిగజిగ మెరుస్తూవుంది.

రాధ, కృష్ణుడి వొడిలో పడుకుంది. అరమోడ్పు కళ్ళతో అతన్ని చూస్తూవుంది. ఆమె మృదుపదారవిందం తాకుతూ స్పర్శ సుఖం అనుభవిస్తున్నాడు కృష్ణుడు. ఆ సుఖంలో, కొంత సేపటివరకూ వారికి మాటలు రాలేదు. తరువాత —

"రాధా! నువ్వు యిలా నా దగ్గిరవుంటే ఎంతో బావుంటుంది."

"నాకూ అలాగే వుంటుంది బావా"

"రాధా! నిన్ను వివాహమాడి, కవి బ్రహ్మనై ప్రేమ గీతాలు రచించి, ప్రపంచాన్ని ప్రేమతో నింపుతా."

"అప్పుడు నేను శారదాదేవినై నీ గీతాలకి స్వరాలుకూర్చి, నా గానంతో ప్రపంచాన్ని పారవశ్యంలో ముంచుతా"

"అప్పుడు సంగీత సాహిత్యాలతో మన గృహమే ఒక ఆనందనిలయమై పోతుందికదూ."

"అంత అదృష్టమా బావా?"

"అందాల చందమామనుంచి ఆనంద చంద్రికలని ఎవరు వేరుచేస్తారు రాధా?"

"ఏమిటో బావా, నువ్వెప్పుడూ కవితా స్వప్నంలోనే వుంటావు."

"పోనీ ... నీ అనుమానమేమిటో చెప్పకూడదా రాధా"

"మీరు భాగ్యవంతులు. నాలాంటి పేదపిల్లని చేసుకుంటా ... "

"ఆఁ ... ఆఁ ... ఏమంటున్నావ్ రాధా! పేదపిల్లవా? డబ్బుకీ ప్రేమకీ సంబంధం ఏమిటి? అన్నిటికీ అతీతమైనదే ప్రేమ."

"పంబంధం లేకపోయినా మన సంఘం కల్పిస్తూవుంది."

"వెధవ సంఘం గొడవ ఎవరిక్కావాలి? జడిసేవాళ్లని జడిపిస్తుంది. అంతేగా?"

"అంతేకాదు. ఒకొక్కసారి ఎంత త్యాగాన్నయినా కోరుతుంది."

"ఎంతటి త్యాగానికైనా సిద్ధంగా నేవున్నా. ఆకాశంలో ఆ నక్షత్రాలవంక చూడు. విరాట్పురుషుడు ఎన్నికోట్ల నేత్రాలతో చూస్తున్నాడో. ఆయనే మనకిసాక్షి. విశ్వసాక్షిగా చెబుతున్నా. నిన్నే పెళ్లాడతా. నన్ను నమ్మవూ."

"ధన్యరాలని బావా" అంటూ రాధ అతని బాహువుల్లో యిమిడిపోయింది. చందమామ సిగ్గుతో మబ్బులమాటుకు పోయాడు.

ఆ మర్నాడు:

కాలేజీ తెరిచారు. కృష్ణుడు విజయవాడ వెళ్లిపోతున్నాడు. అందరితోపాటు రాధతోకూడా చెప్పి బండి ఎక్కాడు. బండి కదిలింది. రాధ అతన్ని వదల్లేక వదల్లేక నుంచుండిపోయింది వీధి గుమ్మంలో. గుమ్మానికి తల ఆనించి కన్నీళ్ళతో బావని సాగనంపింది.

♦ ♦ ♦

రాధా కృష్ణులు మేనత్త మేనమామ బిడ్డలు. ఉభయుల యిళ్లూ దగ్గిర కావటంచేత, చిన్నతనం నుంచీ ఒకరి నొకరు విడిచివుండేవారుకాదు. అదే యవ్వనంలో ప్రేమగా పరిణమించింది.

కృష్ణుడి తండ్రి చాలా ధనవంతుడు. కాని ఎంగిలిచేత్తో కాకిని కొట్టడు. కొడుకు చదువుకోసం ఖర్చుపెట్టిన డబ్బు, వడ్డీతో సహా కట్నంద్వారా, రాబట్టుకోవాలని అతని సంకల్పం.

ఒక రోజు రాధ తండ్రి వెళ్ళి, బావతో పెళ్లి విషయం కదిపాడు. నిర్మొహమాటంగా పదివేల కట్నానికి దమ్మిడీ తగ్గదన్నాడు. రాధ తండ్రి యస్. జి. ఓ. అంత పెద్ద కట్నం ఎక్కడ తేగలడు. నిరాశతో యింటికివచ్చేశాడు. తరవాత రాధతల్లి కూడా వెళ్లి అన్నతో అనేక విధాల చెప్పిచూసింది. ప్రేమపక్షులిని విడదీయవద్దని ఎంతో బ్రతిమాలింది. కన్నీళ్లు కార్చింది. కాని లాభంలేకపోయింది.

రాధ తండ్రికి తీవ్రమైన కోపం వచ్చింది. "నా పిల్లకి పెళ్లి కానప్పుడు చూస్తానంటూ", వెంటనే మరొక సంబంధం నిశ్చయం చేశాడు. పెళ్ళి ఆపమని రాధ తండ్రిని ఎంతో బతిమాలింది. ఆమె మాటలు లెక్క చేయలేదతడు.

ఏం చెయ్యటానికీ, తోచలేదు రాధకి. గదిలోకి పోయి యిటూ అటూ అనేకసార్లు తిరిగింది. తల పీక్కుంది. పడుకుని తలగడ తడిసేలా విలపించింది. ఆఖరికి ఒక ఆశారేఖ అంధకారంలో మెరిసింది. బావకి వుత్తరం రాస్తేనో అని -

"బావా! మీ నాన్న కట్నంకోసం గట్టిపట్టు పట్టారు. అంచేత నాన్న నాకు మరో సంబంధం నిశ్చయంచేశారు. ముహూర్తం సరిగ్గా వారం రోజులే వుంది. ఆపమని ఎంత మొత్తుకున్నా లాభంలేకుండా వుంది. ప్రతిక్షణం నీరాక కోసం ఎదురు చూస్తుంటా. ఏమాత్రం ఆలస్యం జరిగినా, నీ రాధ ఈ లోకంలో వుండదు. వెంటనేవచ్చి నన్ను రక్షించుబావా" — నీ రాధ.

రాధ, వుత్తరం రహస్యంగా పోస్టులో వేయించింది. కాని సమయానికి కృష్ణుడువచ్చి రక్షించగలడో లేడో అని ఆమెభయం.

రాధకి జరిగిన అన్యాయానికి, ఆమె హృదయాకాశంలో ప్రళయంలాంటి తుపాను లేచింది. ఆమె అంతరజగత్తును కంపింపజేసింది. ఆమె గడగడ వణికిపోయింది. కొంతసేపటికి ఆమె హృదయంలో తుపాను బాహ్యప్రపంచాన్ని ఆవరించింది.

కీకారణ్యంగా మబ్బులు మూసుకున్నాయి. రోషావేశంతో పెనుగాలి 'రివ్‌రివ్' మని వీచింది. ప్రశాంతంగావున్న ఆకాశానికి ఆగ్రహంకలిగింది. సముద్రమైపోయింది. ప్రళయ వీచికలు సాచింది. ఆకాశంలో సముద్రఘోష వినిపించింది. ఉరుములు ప్రళయార్భాటాలు చేసినై. 'రాధ పెళ్లి అన్యాయం' అంటూ మేఘాలు గర్జించినై. మెరుపులు కంగారుగా పరువులు తీసి, ఈ అన్యాయాన్ని ఊర్ధ్వలోకాలన్నిటికీ చెప్పినై. భూమ్యాకాశాలు జలధారలతో ఏకమైనై. అలా మూడురోజులువుంది తుపాను.

తుపానువల్ల రాకపోకలు సరిలేక రాధ వివాహానంతరం కృష్ణుడికి ఆమె వుత్తరం చేరింది.

బాహ్య ప్రపంచాన్ని వదిలిన తుపాను కృష్ణుడి హృదయంలో ప్రవేశించి అతన్ని వూపేసింది. రాధ వుత్తరం చదువుకుని, తల గోడకేసి బాదుకుని ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయాడు కృష్ణుడు.

* * *

సాధారణంగా నూతనదంపతులు నవ్వవికాసంతో వెలుగుతారు. ప్రేమ కౌగిళ్ళలో పరవశత్వం చెందుతారు. ప్రకృతినే ప్రేమ మందిరంగా చేసుకుని అమర సుఖం అనుభవిస్తారు.

కాని రాధ, వివాహానంతరం అదోలా మారిపోయింది. పంజరంలో పక్షిలాగ నీరసించిపోయింది. గ్రహణంనాటి కళానిధిలాగ, ఆమె మొహం కళావిహీనమైపోయింది. వెనుక ఆమె ఎప్పుడూ నవ్వుతూ వుండేది. ఇతరులని నవ్వించేది. ఇప్పుడసలు నలుగురులోకి రావటమే మానుకుంది. ఎవరైనా పలకరిస్తే పలకటమే ఆమెకి ఎంతో విసుగ్గా వుండేది.

పొద్దెక్కి నీరసంగా లేచేది. మునుపటిలాగ కాక, సబ్బుతో వొళ్లు తోముకోకుండానే స్నానంచేసేది. మునుపు కోకలు మంచి మంచివి ఏరుకుని కట్టుకునేది. ఇప్పుడు ఏ కోకైనా ఒకటే. మునుపు నిలువుటద్దం ముందు నుంచుని గంటల తరబడీ ముస్తాబయ్యేది. ఇప్పుడు అద్దాన్నే మరిచిపోయింది. చేయెత్తి బొట్టు పెట్టుకోబోయేది. కన్నీళ్ళతో చెక్కిళ్ళు తడిచేవి. ఎత్తిన చేయి కిందికి వాలిపోయేది. గోడ మీద వ్రేలాడుతున్న బావఫోటో చూస్తూ, కన్నీటితో కోకచెంగు తడిపేది. బావ తిరిగిన స్థలానికిపోయి వెర్రిగా అతన్ని వెదికేది. బావ చదివిన పుస్తకం హృదయంమీద వుంచుకుని గంటలకొద్దీ శూన్యాకాశంలోకి చూసేది.

రాధ హృదయంలో మానని పుండు లేపింది. ఆమెని కుష్కింపజేసింది. ఏ దేవుడికి విన్నవించుకున్నా బాధ నివారణయ్యే ఆశగాని, అవకాశం గాని యిక లేదు. క్రమక్రమంగా మంచం పట్టిందామె. ఎంతమందో డాక్టర్లు మందులిచ్చారు. అన్నీ వ్యర్ధమయాయి. మనోవ్యాధికి మందా?

ఆ రోజు వ్యాధి మరీ తీవ్రమయింది. "కృష్ణా... కృష్ణా" అంటూ రాధ మూలుగుతూవుంది. 'కృష్ణా అనే యింత కొంప ముంచావు. ఇకనైనా బావని మర్చిపో అమ్మా!' అంది ప్రక్కన కూర్చున్న తల్లి.

"అయ్యో! బావని కాదమ్మా... భగవంతుణ్ణి" అని రాధ సర్దుకుంది. రాధా మాధవుల్లాగ ఆనందంగా వుంటారనుకున్నా. వాడికట్నం తగలబెట్ట నీ వుసురు పోసుకున్నాడమ్మా" అంటూ రాధ తల్లి కన్నీరు కార్చింది. "నువ్వు వద్దంటుంటే బలవంతంగా పెళ్ళి చేశానమ్మా మూర్ఖుణ్ణి" అంటూ రాధ తండ్రి బాధపడుతున్నాడు.

"నాకోసం ఎందుకలా దుఃఖిస్తావు నాన్నా. అయ్యో! ఆడపిల్లనైపుట్టి మీకు ఎంత దుఃఖం తెచ్చిపెట్టాను - మీ ఎదురొమ్ములమీద కుంపటినై కూచున్నాను. నేనే కొడుకునై పుట్టివుంటే మిమ్మలిని ఎంత సుఖపెడుదునో కదా"

"మాట్లాడకమ్మా... డాక్టరిని మళ్ళీ పిలుచుకురానా"

"ఇంకా నన్ను బతికించాలని ఎందుకు బాధపడతావు నాన్నా. చేదుమందులు ఎందుకు తాగిస్తావు? నా శరీరం సూదుల్తో ఎందుకు పొడిపిస్తావు? నాన్నా నీపాదాలు పట్టుకుంటూ, బావని ఒకసారి పిలిపించు నాన్నా, నీకెంతో పుణ్యంవుంటుంది. బావని కళ్లారా చూచి ప్రాణం వదుల్తాను. నా తుది ప్రార్ధన మన్నించవూ?"

"ఇదిగో యిప్పుడే టెలిగ్రాం యిస్తున్నా. బావ తప్పకుండా వస్తాడు. అందాకా బాధపడకుండా పడుకో తల్లీ," అంటూ బయిటికి వెళ్ళాడు రాధ తండ్రి.

కృష్ణుడికి టెలిగ్రాం అందింది. వెంటనే రైలు ఎక్కాడు. బండిదిగి సరాసరి రాధ దగ్గిరికి వచ్చాడు. ఆమె మంచంమీద కూచున్నాడు. రాధ బాధతో మూలుగుతూవుంది. ఆత్రుతతో 'రాధా... రాధా' అని పిలిచాడు, "ఎవరు?" అంది రాధ నీరసంగా.

"నేను... రాధా... నేను... బావని"

"వచ్చావా బావా! వచ్చావా! కలకాదుకదా! నామీద ఎన్నాళ్ళకు దయవచ్చింది బావా? నీకోసమే ఎదురు చూస్తున్నా. ఇక నిశ్చింతంగా ప్రాణం వదుల్తా" మూతలు పడుతున్న కళ్ళతో అతన్ని చూసింది రాధ.

"రాధా! నీ వుత్తరం నీ పెళ్ళయిపోయాక నాకు అందింది. నేను నిన్ను రక్షించలేకపోయాను."

"బావా నన్ను క్షమించు. పెళ్ళిచేసుకుని నీకు ద్రోహం చేశాను."

"రాధా యిది నీ తప్పుకాదు. నాతండ్రిది. ఆయన ధనదాహంతో మన ప్రాణాలు తీశాడు."

కృష్ణుడి వొడిలో రాధ తలవుంచి అతనికేసి చూసింది, కృష్ణుడు ఆమెవంక చూస్తూ కన్నీళ్లు కార్చాడు.

"అదుగో బావా ... ఏడుస్తున్నావు. నన్ను సుఖంగా కళ్ళు మూయ్యనివ్వవా?"

"అబ్బా! రాధా నీ సౌందర్యం మటుమాయమయిందా? నీ కళ్ళల్లో కాంతి, నీ హృదయంలో శాంతి, నీలో ఆశ అంతరించాయా! నా హృదయకమలంలో దాచుకుని, ఎప్పుడూ నిన్నే దేవతగా ఆరాధించుకున్నా. నీవే ప్రపంచమనుకున్నా. నిన్ను పెళ్ళిచేసుకుని ఒక ఆదర్శదాంపత్యాన్ని, ఈ పాడు ప్రపంచానికి ప్రదర్శించాలనుకున్నా. మన ప్రేమ సౌధాన్ని నా తండ్రీ కూల్చేశాడు. హృదయంలేని సంఘానికి, కనికరంలేని కట్న పిశాచానికి మనం బలైపోయాం."

"బావా! ఈ లోకంలో నాలాంటి అందమైన రాధలు ఎందరో వున్నారు. పెళ్ళిచేసుకుని సుఖంగా వుంటానని చేతిలో చేయి వెయ్యిబావా, సంతోషంతో కళ్ళుమూస్తాను."

"రాధా ఎడారిలా మండుతున్న నాహృదయంలో యింకా కణకణలాడే నిప్పులు జల్లుతున్నావా? నీవు లేని ఈ శూన్య ప్రపంచంలో నన్నింకా జీవించమంటావా? ఏ ఆశతో జీవించను? నీ వన్నట్లు ఈ లోకంలో ఎందరో అందమైన రాధలు వున్నారు. కాని రాధా నీ అందాన్ని కాదు ప్రేమిస్తా నిన్నే ప్రేమించాను. ఆ రాత్రి విశ్వసాక్షిగా నిన్నే పెళ్ళి చేసుకుంటా నన్నాను జ్ఞాపకం లేదూ?"

"బావా! నన్ను మనసార ప్రేమించినందుకు, నేను పెళ్ళిచేసుకుని నీకు తీరని దుఃఖం కలిగించాను. నీకోసం ఎంతో ప్రయత్నించాను. కాని విఫలమై పోయాను. చివరికి నీ రాధను కాలేకపోయాను.— అబ్బా! ఆయాసం ... మాట్లాడలేను." వణికిపోయింది రాధ. కృష్ణుడు ఆమెని పొదివి పట్టుకున్నాడు.

రాధ కళ్లు మూసింది. ఆమె పెదవులు మాత్రం 'భావా ... బావా' అన్నట్టు కదిలినై. కృష్ణుడు 'రాధా ..... రాధా' అని కంగారుగా పిలిచాడు. జవాబులేదు. ఆమె యిక ఎన్నటికీ మాట్లాడదు. కళ్ళు తెరవదు. 'రాధా' — అంటూ పెద్ద కేక వేసి ఆమెమీద పడిపోయాడు కృష్ణుడు. అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు.

రాధను మంచం దింపారు.

కృష్ణుడు మంచం ఎక్కాడు.



★

# సుతస్మృతి

డాక్టరు పాలూరి లక్ష్మీనారాయణగారు

సుందరమూర్తి వౌచు కడుశోభను తెచ్చు విధేయభావమున్
అందముగాను చూపుచును యందరి ప్రేమను చూరగొంచు నీ
యందలి ధీరభావమును నాత్మసమర్పణమందుచూపి పో
వందగునయ్య యో తనయపావననామ శివప్రసాదమా.

ఇరువదియొక్కటి యేడులు - జరుగగ నికమేనుబాసి సాధువటంచున్
అరుదగు మెప్పును బొందియు - యరిగితి గదనన్నువీడి యాత్మతనూజా.

పేరిడ ప్రసాదమంచును - పేర్మి ప్రసాదంబునిడితి ప్రియతమ హర్షం
బారీతి జరుగకాలము - తీరని దుఃఖప్రసాద తీవ్రతనిడితౌ.

దీనత్వమున్నమానిసి - నేనగుటను నిన్నుబోలు నిర్మలరూపున్
ఆనందజనితు పుత్త్రిగ - నేననవరతంబు బొందనేర్తునె యెటులన్.

# చిన్నమ్మ కథ

— శ్రీ తేకుమళ్ల కామేశ్వరరావు

---

(గత సంచిక తరువాయి)

చిన్నమ్మకథ ఒక జంగం కథ; ఆఖ్యానం - అనగా - గద్య పద్య రచన కలది. ఇది సాంఘిక కథ.

## స్థానిక భూగోళ శాస్త్రం

చిన్నమ్మకథ జరిగిన స్థలం కదిరి చుట్టుపట్ల ప్రదేశం, కదిరి పట్టణం అనంతపురం జిల్లాలో ధర్మవరం - పాకాల ఇనుపదారిమీద ఉంది. కదిరి సమీపంలోనే మద్దులేరు ప్రవహిస్తూంది. కదిరిలో కొండమీద నరసింహస్వామి దేవాలయముంది. ఆ దేవుడే మద్దులేటిస్వామి అని జంగం కథలో చెప్పబడ్డాడు. చిన్నమ్మ కథలో చెప్పబడ్డ మరికొన్ని స్థలాలపేర్లు - బోగొండ, ఓలుకొండ, రామక్కచెరువు, ధర్మరాజు గుంట, పాలేరు (ఇదొక చిన్న నది), రాచనీటి (వీరభద్రస్వామి), కొండ పాటి (కోనేరు).

### కదిరి.

కదిరిలో నరసింహస్వామి దేవుణ్ణిగురించి ఖాద్రి స్థల పురాణం 1 అను గ్రంథముంది. దానిలో కదిరి అను పేరుయొక్క వ్యుత్పత్తి ఇట్లు చెప్పబడింది—2. 1. ఖాద్రి (+ఖ+అద్రి) అను సంస్కృత సమాసం యొక్క ఆభాసరూపం కదిరి. 2. ఖదిరి (= వృక్ష విశేషం) చెట్లుగల ప్రదేశం ఖాదిరి, దాని ఆభాస రూపం కదిరి.

కాని కదిరి అనుపేరు ఈ క్రింది విధంగా ఏర్పడిందని నా అభిప్రాయం. కదిర్ అనగా సూర్య కిరణం. ఈ మాట ఈనాటికి అరవభాషలో ఉంది. కదిర్ అను పేరుగల ఒక సుప్రసిద్ధ తమిళ పత్రిక ఇప్పుడు ప్రచారంలో ఉంది. ఆంధ్రులు సూర్యారాధకులు. కాబట్టి సూర్యకిరణం అను అర్థంగల కదిరి శబ్దం పూర్వపు తెలుగు భాషలోని పదమై ఉండవచ్చు. క్రమంగా సూర్యారాధన చాలచోట్లలో వైష్ణవారాధనగా మారింది. ఇట్టి స్థితే కదిరి స్థలంలోకూడ జరిగి ఉండవచ్చు.

### ఖాద్రిస్థల పురాణం

ఖాద్రి స్థలపురాణంయొక్క రచనాకాలాన్ని గురించి చర్చించవచ్చు. దీనిలో మ్లేచ్ఛుల (మహమ్మదీయుల) దాడి, దుండగాలు (పుట 119) విరివిగా నిర్ణించబడ్డాయి. క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యం కూలిపోయింది. కాని మహమ్మదీయులు విచ్చల విడిగా దక్షిణ దేశంలో సంచరించలేదు. ఎందుచేతంటే 1336 లోనే విజయనగర సామ్రాజ్యానికి శంకు స్థాపన జరిగింది. దీనికి ఉత్తరాన 1347 లో బహమని రాజ్యానికి పునాది ఏర్పడింది. ఈ రెండు రాజ్యాలకు ఎడతెగని వైరం. ఒకరి రాజ్యాన్ని ఒకరు కబళించడానికి చూచేవారు. అయితే మ్లేచ్ఛుల దండయాత్రలు కదిరి ప్రాంతంలో విచ్చల విడిగా ఎప్పుడు జరిగేయి?

విజయనగర సామ్రాజ్యాన్ని విరూపాక్షరాయలు (క్రీ. శ. 1469 - 1478) వరకు పరిపాలించేడు. ఇతను చాల బలహీనుడు. కాబట్టి శత్రువులు చుట్టుముట్టేరు. సామ్రాజ్యంయొక్క పశ్చిమోత్తర, ఉత్తర ప్రదేశాలు కొన్ని శత్రువుల వశమయేయి. అనేకచోట్ల

---

1 ఖాద్రి స్థల పురాణం (తెలుగు తాత్పర్యంతో కూడ) - ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, నరసింహస్వామి దేవాలయం, కదిరి, అనంతపురం జిల్లా 1953

2. ఖాద్రి స్థల పురాణం, పుట VIII

మహమ్మదీయులు దాడి చేసేరు. కదిరి ప్రాంతంలో కూడ మహమ్మదీయుల దాడి ఆకాలంలోనె సంభవించిందని ఊహించవచ్చు. ఇటువంటి గొప్ప ఆపద నుండి విజయనగర సామ్రాజ్యాన్ని కాపాడిన మహాపురుషుడు సాళువ నరసింహరాయలు. ఈ ప్రభువు, బలహీనులై, విజయనగరసామ్రాజ్య కారకులవు తూన్న సంగమ వంశీయులనుండి సామ్రాజ్యాన్ని 1485 ప్రాంతంలో గ్రహించి మళ్లీ బాగుచేసేడు. ఇతనికి 3. త్రినేత్ర అను బిరుదు ఉంది. కదిరిలోని నరసింహస్వామి 'విష్ణుస్త్రిలోచన:' 4. (అనగా, మూడు నేత్రములు గల విష్ణువు) అని వర్ణించబడ్డాడు. విష్ణుమూర్తి మూడు కన్నులు కలవాడని వర్ణించబడడం విపరీతం కదా! కాని ఇక్కడి దేవుడైన నరసింహస్వామికి, సాళువ నరసింహనాయకుని పేరుతో సంబంధముండబట్టే, ఇట్టి వర్ణన చేయబడిందని చెప్పవచ్చు. ఈ స్థల పురాణం సాళువ వంశస్థుల కాలంలో రచింపబడడంబట్టే కవికి ఇట్టి సూక్ష్మాంశం తెలిసిందని చెప్పవచ్చు. కాబట్టి ఖాద్రి స్థల పురాణం క్రీ. శ. 1500 ప్రాంతంలో రచించబడి ఉండవచ్చు.

## చిన్నమ్మ కథాకాలం

చిన్నమ్మకథ ఎప్పుడు జరిగింది? విజయనగర సామ్రాజ్యంయొక్క ఆఖరి దశలో వైష్ణవమతం రాజ్యావలంబన పొందింది. యథారాజాతథాప్రజా అన్నారు. కాబట్టి సామాన్య జనులలోకి కొంచెంగా వైష్ణవ మతం పాకింది. ఇదంతా క్రీ. శ. 1550 నాటి స్థితి అని చెప్పవచ్చు.

చిన్నమ్మయొక్క మామగారైన రాఘవరెడ్డి ఇంటిలో శైవ సంప్రదాయం. చిన్నమ్మ ఇంటిలో క్రొత్తగా బయలుదేరిన వీరవైష్ణవం. ఈ రెండింటి మధ్య నలిగిపోయింది చిన్నమ్మ.

చిన్నమ్మయొక్క తల్లిపేరు లచ్చమ్మ. ఆమె కదిరి నరసింహస్వామికి ఆలయం కట్టించిందిట (పుట 2)! స్థానిక చరిత్ర దీనిని కొంతవరకు ధ్రువపరుస్తూంది. 'కదిరి నరసింహస్వామి యొక్క తూర్పు గోపురము రంగరాట్పతినాయుడు, దక్షిణ గోపురము సాళువుల చిన్నమ్మ, పడమటి గోపురము కొక్కల్లు, గ్రామములోని పాలెగాండ్రు, ఉత్తర గోపురము మహమ్మదీయులు కట్టించేరు' 5.

జంగంకథలో చిన్నమ్మ పుట్టింటిపేరు శిలంవారు, అత్తింటిపేరు పసువులవారు అని ఉంది. పైనచెప్పిన దానిలో సాసువులవారు అని ఉంది. జంగంకథలో చిన్నమ్మయొక్క తల్లి స్వామికి గుడి కట్టించినట్లుండగా, స్థానిక చరిత్రలో చిన్నమ్మయే గోపురము కట్టించినట్లుంది. ఇట్టి భేదాలు నోటిమాటలుగా వస్తూన్న విషయాలలో ఉండక తప్పవు. కాబట్టి ఆ భేదాలను అంతగా పాటించనక్కరలేదు. కాబట్టి చిన్నమ్మ కుటుంబంవారు గోపురాన్ని కట్టించేరని చెప్పవచ్చు. గోపుర నిర్మాణం తాలూకు శాసన మేదేనా ఉంటే చిన్నమ్మ కథకు చారిత్రకాధారం దొరికిందని తలచవచ్చు. కాని అట్టిది లేని సందర్భంలో ఊహించవలసి వస్తుంది. పైన చెప్పినట్లు చిన్నమ్మ కథ క్రీ. శ. 1550 ప్రాంతంలో జరిగి ఉండవచ్చు.

చిన్నమ్మకథ అను ఈ జంగంకథ ఎప్పుడు రచించబడింది? జంగం కథలో కథాకాలానికి, పదరచనా కాలానికి చెప్పతగినంత తేడా ఉండదు. కథాంశాలు కలిగించే ఉత్తేజంవల్ల పదరచనకూడ అప్పుడే బయలుదేరుతుంది. కథాఘటనలు క్రీ. శ. 1550 ప్రాంతం అని చెప్పడంవల్ల, జంగం కథారచనకూడ క్రీ. శ. 1550 ప్రాంతం అని స్థూలంగా చెప్పవచ్చు.

---

3. A little known chapter of Vijayanagar History P. 65.
4. ఖాద్రి స్థల పురాణము - పుట 11
5. శ్రీ ఖాదిరి స్థల పురాణము — దీనిని కదిరి, ఎమ్. సయ్యద్ మొహిదీన్ సాబ్ గారు రచించేరు. వీరిది కదిరి, అనంతపురం జిల్లా. 1949 వెల 0-6-0.

## కవి ఎవరు?

ఈ జంగం కథను రచించిన కవిపేరు చెంగల్వరాజు అని పదంయొక్క చివరి చరణాలలో చెప్పబడింది. ఇతనినిగురించి మరొక మాటయిన తెలియడంలేదు. జంగం కథలలో కవులు తమ్ముగురించి చెప్పకొనే ఆచారం ఉంది. కాని పాటకుల, ముద్రాపకుల లోపంవల్ల అవి అచ్చు పుస్తకాలలో ఎక్కలేదని చెప్పవచ్చు.

చెంగల్వరాజు ఈ కథను రచించిన కవా, లేక దాన్ని పాడిన పాటకుడా?

పెద్ద బొబ్బిలిరాజు కథను ద్విపదగా 6. కోడూరి చెంగల్వరాజు (వీరయ) అను నతడు రచించేడుట! ఈ చెంగల్వరాజు పైనచెప్పిన చెంగల్వరాజు ఒక్కరో, వేరో నిర్ణయం చేయడానికి తగినన్ని ఆధారాలు లేవు. పెద్ద బొబ్బిలిరాజు (ద్విపద) కథను సంబంధించిన చెంగల్వరాజు ఎప్పటివాడో స్థూలంగా చెప్పుకోవచ్చు. బొబ్బిలియుద్ధం క్రీ. శ. 1757లో జరిగింది. కాబట్టి అతను ఆటుతర్వాతి వాడు అని స్పష్టమవుతూంది. 1757 ప్రాంతముందే పెద్ద బొబ్బిలి రాజు జంగం కథ రచించబడి ఉంటుంది, ఆపదం ప్రచారమైన మీదట కాని ద్విపద బొబ్బిలిరాజుకథ రచించడానికి వీలులేదు. కాబట్టి ద్విపద కథ ఆటు తర్వాతదే! ఇట్లుండగా — చిన్నమ్మ కథలో ఒక విశేషమున్నది. చిన్నమ్మ కాలంనాటి సంగతులను, ఇప్పటి కాలంతో సరిపోల్చుతూ చెప్పబడే రిమార్కులు కొన్ని ఉన్నాయి. అవి ఏవంటే—

1. చిన్నమ్మ దీపం పెట్టగా చాలకాలం ఉందని చెప్పతూ కవి—

ఈనాటివారు దీపం పెట్టితే అరగడియ
వుండదు
ఆనాడా చిన్నమ్మ దీపము పెట్టితే
ఏడు ఏడు పద్నాలుగు ఏండ్లు ఒక్కటె
దీపంబు.

2. చిన్నమ్మకు మామగారిమీద భక్తి అధికమని చెప్పవచ్చి కవి—న. "మామగారి పాదము పట్టుకొని నీళ్లతో కడిగి, పైకొంగుతో అద్ది, కంటితో అద్దుకొని, ఆ పాద జలమును శిరసావహించి, మామతో చిన్నమ్మ మనివిచేయుచున్నది. ఇట్లుండగా యీ కాలములో ఉండే కోడండ్లు అత్తవచ్చినా లేవరు, మామ వచ్చినా లేవరు, మొగుడు వచ్చినా లేవరు......"

పైన ఉదహరింపబడినవాటిలో ఈనాడు అని చెప్పబడే కాలం ఇరవయో శతాబ్దమే కాని మరొకటి కాదు. ఎన్నడో క్రీ. శ. 1550 ప్రాంతంలో పుట్టిన పదంలో అట్టి వాక్యాలను వినువారిని ఆకర్షించడంకోసం పాటకులు చేర్చినవే అని నిర్ణయించవచ్చు. ఈ పాటలో చెప్పబడ్డ చెంగల్వరాజు అను పేరు పాటకుని పేరుకాని కథారచయితది కాదు. పాటగాళ్లు అనేక పాటలను పాడుతూంటారు కదా! కోడూరి చెంగల్వరాజు (వీరయ) ఈ పాటకుని పూర్తి పేరు కావచ్చు. ఇతను పెదబొబ్బిలిరాజు ద్విపదనుకూడ పాడేవాడేమో! ఏదయినా వీరు ఇద్దరు చెంగల్వరాజులు కారు; ఒక్కడే అని స్థూలంగా చెప్పుకోవచ్చు. మొత్తంమీద ఈ జంగం కథను రచించిన కవి మాత్రం తెలియలేదు. (సశేషం)

6. మద్రాసులోని ప్రాచ్యలిఖిత భాండాగారంలో B.M.C. 14174 K 51 (౮) సంఖ్యగల గ్రంథం పెద్ద బొబ్బిలిరాజుకథ (ద్విపద) అని నిడదవోలు వేంకటరావుగారి ద్విపదవాఙ్మయ సూచికనుండి తెలుస్తోంది.




సుందర భారతయాత్ర (ప్రథమభాగము) : విద్వాన్ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు. ప్రచురణ కర్తలు : సాధన గ్రంథమండలి, తెనాలి. వెల రు. 2-8-0.

మొదటి ప్రకరణమున యాత్రావైభవమును పలువురు పండితులు, పూజ్యులు వివరించు అభిప్రాయములు, వ్యాసములు కలవు.

తర్వాత యాత్రా ఖండమందు యాత్రికులు గ్రహించవలసిన విశేషములు కలవు.

ద్వారక, కాశీఖండములందు క్షేత్రములు, పట్టణములను గురించిన విశేషములు పొందుపరచబడియున్నవి. ఇందలి షుమారు 130 దర్శనీయ స్థలములకు సంబంధించిన వివరణయాత్రాసక్తికలవారికి బహుళోపయుక్తమైనది. ఇందలి చిత్రములు పాఠకులకు ప్రత్యేక ఆసక్తిని కలిగించుచుండును.

శ్రీ ఆంజనేయ కవీయము : విద్వత్కవిభూషణ, విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మగారు, 66 సామిపిళ్లై వీధి, చూళ, మద్రాసు-7. వెల 0-6-0.

ఇది క్షేమేంద్రుని కృతియగు 'చారుచర్య'కు ఆంధ్రానువాదము. దీనిని రచించిన గ్రంథకర్తను ప్రశంశించవలసియున్నది. ఇందలి శైలి సులభమై సర్వజనులకు అందుబాటులోనున్నది.

ఇది గ్రంథకర్త మిత్రులు 'సాహిత్య సరస్వతి' సిరిపి ఆంజనేయులుగారి కంకితమీయబడినది. మూలములోని భావములు తేటగీతలలో బహు చక్కగా పొందుపరచబడియున్నది.

ఈ చిన్నపుస్తకము పండిత పామరుల ఆదరాభిమానములకు ప్రాతము కాగలదని మా నమ్మకము.

♦ ♦ ♦

'తెలుగు విద్యార్థి' సంక్రాంతి సంచిక మా కార్యాలయమునకు చేరినది. వెల 0-4-0. ప్రతులు తెలుగు విద్యార్థి కార్యాలయం, మచిలీపట్నంకు వ్రాసి తెప్పించుకోవచ్చును.

చక్కని కథానికలు, అమూల్యమైన వ్యాసాలతో వెలువడిన యీ సంచిక విద్యార్థిలోకంలో విద్యా విజ్ఞానాలతోబాటు చక్కని పురోభివృద్ధిని రూపొందించుకోడానికి తోడ్పడగలదు. 'తెలుగు విద్యార్థి' విద్యార్థి లోకమునకు మార్గదర్శకముగానుండి సుశిక్షణ, సమరస సమైక్యతలను ప్రోత్సహిస్తూ కలకాలం వర్థిల్లాలని మా ఆశ.

♦ ♦ ♦

'విజయవాణి' సంక్రాంతి సంచికను స్వీకరించినాము. వెల 0-2-0. ప్రతులకు విజయవాణి కార్యాలయం, విజయవాడ.

అమూల్యమైన వ్యాసాలతో, సంక్రాంతి వెలుగులతో వెలువడినది. జాతీయభావాలు, ఉద్యమాన్ని ప్రోత్సహిస్తూ తెలుగునాట అమోఘమైన కృషి సల్పుతున్న యీ పత్రికను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.

---

# సంపాదకీయములు

## విద్యార్థులు - విద్య - విద్యాలయాలు.

ఏదేశమయినా అభివృద్ధి చెందినదనిపించుకోడానికి ప్రజలకు నిత్యావసరాలకు లోటులేకుండా యుండటం ప్రధానచిహ్నము. నిత్యజీవితావసరాలనేవి కూడు గుడ్డ, నివాస వసతులతోబాటు ఆరోగ్య వసతులు విద్యావిజ్ఞానవసతులుకూడ ప్రధానములు. విద్యావిజ్ఞానములు, ఆరోగ్యములేనిదే ఏజాతియు సౌభాగ్యవంతమైనదనిపించుకోదు. కాబట్టి ప్రజల పురోభివృద్ధి నుద్దేశించి ప్రభుత్వము, ప్రజలుకూడ విద్యావ్యాప్తికి అత్యంత శ్రద్ధాసక్తులు చూపాలి.

అయితే యీనాడు మనదేశంలోని విద్యాలయాల స్వరూపం, శిక్షణాపద్ధతి, విద్యావిధానము సంస్కరించబడవలసిన ఆవశ్యకత ఎంతైనాయున్నది.

విద్యార్థులకు విద్యాలయాలలో సుశిక్షణాయుతమైన విద్య అమరాలి. క్రమశిక్షణయొక్క ప్రాముఖ్యత బోధపడాలి. భవిష్యత్తులలో భారతపౌరుడుగా తమ బాధ్యతలను ఆవీటికావేడు అవగాహనం చేసికొని జీవయాత్రకు తయారయేస్థితిలో నుండాలి. తాము ఆర్జించిన విద్య, విజ్ఞానాలు జాతీయ శ్రేయస్సుకు, స్వీయాభివృద్ధికి వినియోగించుకోడానికి ఆయత్తమగుతుండాలి. విద్యార్థిగా నున్నంతకాలము తాము నేర్చుకొను ప్రతిశాస్త్రము, కళ అవగాహనం చేసికొనేస్థితిలో నుండాలికాని అరకొర విజ్ఞానంతో కార్యాచరణ రంగంలోకి దిగడం తనకుగాని, దేశానికిగాని ఉపయోగం కానేరదు. తన లక్ష్యం పరిపూర్ణ విద్యావిజ్ఞానముల నార్జించడం భవిష్యత్తులో వానిని తనయొక్క దేశంయొక్క, అభ్యుదయ పురోభివృద్ధులకు వినియోగించి, సేవజేయడంగా నుండాలి. దీని కనుగుణ్యమైన విద్యావిధానము రూపొందవలసిన ఆవశ్యకత ఎంతైనా కలదు.

ఇక యీ విద్యావసతులు బీదసాదఅనే విచక్షణ లేకుండా ప్రతియొక్కరికి అనుకూలంగ ప్రభుత్వము చూడటం అభ్యుదయమనిపించుకుంటుంది. ఆంధ్రస్టేటులో వచ్చే ఏటినుండి మూడవఫారంవరకు ఉచిత విద్యా వసతులను సమకూర్చాలనే యుద్దేశము ఆంధ్ర ప్రభుత్వానికున్నదని ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి గారు ప్రకటించడం అభినందించతగినది. ముఖ్యంగా శ్రామిక, మధ్యతరగతుల ఆర్థికస్తోమతు కనుగుణ్యంగా ప్రాథమిక, మాధ్యమిక విద్యావసతులు యావత్ప్రజానీకానికి ఉచితంగా అమరవలసియున్నది. ఈ విషయంలో ఆంధ్ర ప్రభుత్వమేకాక అన్నిరాష్ట్రాలు తగు శ్రద్ధవహించాలి.

ఇక విద్యాలయాలు ఎయిడ్‌తో నిర్వహించబడేవి చాల అసంతృప్తికరంగానున్నవి. ఎయిడెడ్ పాఠశాలల మేనేజర్లు విద్యార్థుల పురోభివృద్ధిపట్ల చూపే శ్రద్ధ చాలా తక్కువ. ఆ పాఠశాలలో ఉపాధ్యాయులు పడుతూన్న యాతనలు చాల విచారకరమైనవి. స్వార్థపరులైన ఎయిడెడ్ స్కూళ్ల మెనేజర్లు విద్య గరపుతున్న ఉపాధ్యాయులను ప్రోత్సహించక బాధలు పెట్టడం మూలంగా ఉపాధ్యాయులు చిత్తశుద్ధితో తమ ధర్మాలను నిర్వహించలేకున్నారు. ఈ పరిస్థితులలో ప్రాథమిక, మాధ్యమిక విద్యాలయాలను ప్రభుత్వమైనా నిర్వహించ కలుగాలి! లేదా స్థానిక సంస్థలైనా కట్టుదిట్టమైన ప్రభుత్వ అజమాయిషీ క్రిందనైనా నిర్వహించబడాలి!

విద్యార్థులు, ఉపాధ్యాయులు పరస్పర సద్భావ, ఆసక్తులతో వ్యవహరించిననాడుకాని విద్యావిజ్ఞానాలు వర్ధిల్లవు. దాని కనువైన వాతావరణమును సృష్టించవలసిన బాధ్యత ప్రభుత్వముమీద నున్నది. ప్రభుత్వము ఆర్థిక, రాజకీయ పురోభివృద్ధులపట్లచూపే ఆసక్తినే విద్యావిజ్ఞానాల వ్యాప్తిపట్లకూడ చూపిననాడు అభ్యుదయ పురోభివృద్ధులు యథేచ్ఛగా సమకూరగలవు.

## శ్రీ మన్మథనామ సం॥ర ఫాల్గుణమాసము

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ మార్చి నెల | 16 | శు | చ 27-47 భ 52-59 |
| | 17 | శ | పం 22-49 కృ 50-16 త్యా 3-49 తిథిద్వయం |
| | 18 | ఆ | ష 17-44 రో 46-33 కుమారషష్టి |
| | 19 | సో | స 12-15 మృ 42-31 |
| | 20 | మం | అ 6-6 ఏష్యం 53-33 ఆర్ద్ర 38-0 |
| | 21 | బు | ద 53-10 పున 33-23 |
| | 22 | గు | ఏ 47-4 పుష్య 29-2 అమృతసిద్ధియోగః |
| | 23 | శు | ద్వా 41-20 ఆశ్రే 25-2 |
| | 24 | శ | త్ర 36-44 మఖ 21-55 |
| | 25 | ఆ | చతు 32-57 పూఫ 19-38 |
| | 26 | సో | ○ పౌ 30-18 అహోబిల నరసింహస్వామి గరుడోత్సవం. |
| | 27 | మం | కృపా 28-51 హ 18-26 |
| | 28 | బు | ది 28-40 చి 19-39 |
| | 29 | గు | తృ 29-42 స్వా 22-4 |
| | 30 | శు | చ 31-50 విశా 25-3 |
| | 31 | శ | పం 34-56 అనూ 30-1 త్యా 4-22 |
| 1956 సం॥ ఏప్రిల్ నెల | 1 | ఆ | ష 38-50 జ్యే 35-17 |
| | 2 | సో | స 43-17 మూ 41-4 |
| | 3 | మం | అ 47-57 పూషా 47-4 |
| | 4 | బు | న 52-36 ఉషా 53 57 త్యా 4-24 |
| | 5 | గు | ద 56-58 శ్ర 58-51 |
| | 6 | శు | ఏ 60-10 ధ 60-10 త్యా 4-21. |
| | 7 | శ | ఏ 0-40 ధ 3-34 సర్వేషామేకాదశి |
| | 8 | ఆ | ద్వా 3-34 శత 8-15 దగ్ధయోగః |
| | 9 | సో | త్ర 5-27 పూభా 11-33 మాసశివరాత్రి |
| | 10 | మం | చతు 6-9 ఉభా 13-47 |
| | 11 | బు | ● అమా 5-58 రేవ 14-47 త్యాజ్యాభావః |
| | | | **శ్రీ దుర్ముఖినామ సం॥ర చైత్రమాసము** |
| | 12 | గు | శుపా 4-0 అశ్వ 14-35 త్యా 3-59 తెలుగు సంవత్సరాది. |
| | 13 | శు | ది 1-4 ఏష్యం 56 1 భ 13-12 త్యా 3-51 |
| | 14 | శ | చ 52-8 కృ 10-46 త్యా 3-47 అమృతయోగం. |
| | 15 | ఆ | పం 46-19 రో 7-26 త్యా 3-44 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.,
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



రజతోత్సవ సమావేశ దృశ్యము: అధ్యక్షులు శ్రీ రెడ్డిగారు మధ్య యున్నారు







శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్ పరివారము తరపున
మేనేజరు శ్రీ వి. యస్. ఆర్. ఆంజనేయులుగారు అభినందన పత్రము
సమర్పించుచున్న దృశ్యము

